# పిల్లలలో చాలమంది అవసరమైనన్ని పాలు తాగరు



## అందుకే వారికి కావాలి కాల్షియం-శాండోజ్® బిళ్ళలు

**భారతదేశంలో చాలమంది పిల్లలలో కాల్షియం కొరత ఉంది**

మరి, మీ పిల్లలలో కూడానా? మీ పిల్లలకు కావలసిన కాల్షియం పోషణ వారి పళ్ళకూ, ఎముకలకూ లభిస్తోందా అన్నది మీరే చూసి చెప్పగలరు. వారిలో అందరూ రోజుకు చెరో 3 పెద్ద గ్లాసుల పాలు తాగుతున్నారా? లేదు! అయితే వారికి కాల్షియం-శాండోజ్ బిళ్ళలు తప్పని సరిగా కావలసిందే.

కాల్షియం-శాండోజ్ గట్టిపళ్ళు, దృఢమైన ఎముకలు పెంపొందేందుకు తోడ్పడుతుంది. విటమిన్ సి, డి, బి12 తో బలపరచపడి, రాస్ప్బెర్రీ రుచిగల కాల్షియం-శాండోజ్ బిళ్ళలు బలే రుచికరమైనవి. పిల్లలు ఆవంటే ముచ్చట పడతారు.

కాల్షియం-శాండోజ్—ప్రపంచంలో మేలైన కాల్షియం స్విట్జర్‌లెండ్‌లోని శాండోజ్ వారు రూపొందించినది.



మీ పిల్లలకు రోజూ కనీసం 4 కాల్షియం-శాండోజ్ బిళ్ళలు కావాలి 2 బిళ్ళలు ప్రతిసారి భోంచేసే ముందు



## కాల్షియం-శాండోజ్®

**గట్టి పళ్ళు, పటిష్టమైన ఎముకలకోసం**



అధిక కోకో
పోషకత్వం

అధిక
కోకో రుచి

క్రొత్త

# బోర్న్‌విటా అధిక కోకో గలది !

ఇప్పుడు బోర్న్‌విటాలో అధికంగా కోకో ఉన్నది.
...షకత్వం కోసం—మరియు ఇది
...ేందుకు !

...ల్గినచ్చు ఐరన్‌తో సమృద్ధమైనది.
...న బి&డి మరియు క్యాల్షియం, ఫాస్ఫరస్,
...మరియు పొటాషియం వంటి అమూల్యమైన ఖనిజ
...లవణాలు కూడా ఉన్నాయి. వేడి కప్పు పాలలో రెండు చెంచాలతో రుచికరమైన పోషకత్వంగల పానీయం తయారవుతుంది.

మీ పిల్లలకు బోర్న్‌విటా ఇవ్వండి రోజుకు రెండుసార్లు. వారి ఎదిగే శరీరాలకు అమూల్యమైన పోషకత్వం చేకూర్చేందుకు సహాయపడుతుంది. మీకూ బోర్న్‌విటా అవసరం...వారికి తగ్గట్లుగా ఉండేందుకు !

**75 పైసలు ఆదా చేయండి.**

బోర్న్‌విటా మీకు 75 పైసలు ఆదాచేసే 450 గ్రాముల రీఫిల్ ప్యాక్‌లో కూడా దొరుకుతుంది. ఈ ప్యాక్ తెరవగానే, దానిలోని పదార్థాలను వెంటనే మామూలు బోర్న్‌విటా డబ్బాలోనికి పోయండి. దాని తాజాదనాన్ని నిలిపేందుకు.






క్యాడ్‌బరీస్
**బోర్న్‌విటా**
అధిక కోకో పోషకత్వం
అధిక కోకో రుచి

OBM/6714 TL

# బ్యాంక్ అంటే ఏమిటి?

1

యునైటెడ్ కమర్షియల్ బ్యాంక్

యునైటెడ్ కమర్షియల్ బ్యాంక్

బ్యాంగ్ ఏమిట

బ్యాంగ్ కాదురా దద్దమ్మా బ్యాంక్, అంటే డబ్బు వుండే చోటు.

పద, చూచివద్దాం.

దూత్, టిక్కెట్లు అమ్మే చోటులా వుంది. ఏదో రాసివుంది కూడా.

చూచావా, ఆమెది, బోల్డు డబ్బు అతడు దాచేసాడు.

పదరా ఆ పెద్దమనిషితో చెప్తాం.

ఇదేకదూ

బ్యాంకుకు రావడం

అవును

మరి ఆమె సంగతి?

డబ్బు దా

ఇంకావుంది

# చందమామ

ఈ సంచికలో కథలు-వింతలు-విశేషాలు



ఇవిగాక అమరవాణి, కథాశీర్షిక పోటీ, ఫోటో వ్యాఖ్యలూ వగైరా..


Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 2 & 3, Arcot Road, Madras-600 026 (India). Controlling Editor : NAGI REDDI. CHANDAMAMA is published monthly and distributed in U.S.A. by Chandamama Distributors, West Chester PA 19380. Subscription 1 year $ 6-50. Second Class Postage paid at West Chester, PA.

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'

సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ [''వేదాంతజ్ఞానం''] కు ఆధారం ''వసుంధర'' రచన. బ్రహ్మజ్ఞానం, తత్వజ్ఞానం, వేదాంతజ్ఞానం అన్నవి కుడిచి కూర్చున్న వారికి తప్ప, ఐహిక సమస్యలతో సతమతమయేవారికి ఎంతమాత్రమూ పనికిరావు. అటువంటివి జనసామాన్యంలో ప్రచారం చెయ్యటం వల్ల లౌకికజీవితం దెబ్బ తింటుంది. అంతకన్న విచిత్రమేమంటే, ఈ వేదాంతజ్ఞానాన్ని ఇతరులకు ఉపదేశించే వారికి పనికివచ్చే ఇతర జ్ఞానం ఏమీ ఉండకపోవచ్చు. ఇదే నీతి మనం ఈ కథలో చూస్తాం.

సంపుటి 61 సెప్టెంబర్ '77 సంచిక 3

విడి ప్రతి : 1-25 : : సంవత్సర చందా : 15-00






ధర్మాత్ ప్రచ్యుత శీలం హి.
పురుషం పాపనిశ్చయం
త్యక్త్వా సుఖ మవా ప్నోతి.
హస్తా దాశీవిషం యథా. 1

[ధర్మాన్ని వదులుకున్న వాణ్ణీ, పాపం తలపెట్టిన వాణ్ణీ వదులుకోవటం, చేతికి చుట్టుకున్న విషసర్పాన్ని వదిలించుకోవటం లాగా, సుఖం కలిగిస్తుంది.]

హింసా, పరస్వ హరణే,
పరదారా భి మర్శనం
త్యాజ్య మాహు ర్దురాచారం,
వేశ్మ ప్రజ్వలితం యథా. 2

[హింసా, పరులసొత్తు అపహరించటమూ, పరస్త్రీతో పోవటమూ అనే దురాచారాలు గలవాణ్ణి, తగలబడుతున్న ఇంటిని లాగా, తక్షణం వదిలెయ్యాలి.]

పర స్వానాం చ హరణం,
పరదారా భి మర్శనమ్,
సుహృదా మతిశంకా చ
త్రయో దోషాః క్షయావహాః. 3

[పరధనం హరించటమూ, పరస్త్రీలను పొందటమూ, మిత్రులను అనుమానించటమూ అనే మూడు దుర్గుణాలూ నాశహేతువులు.]

దుర్గుణాలు




## 50

ఆ పాపిష్ఠి పిల్లి మాటలు నమ్మి, మతి మాలిన కుందేలూ, కౌజుపిట్టా దాన్ని సమీపించాయి. అది ఒకేసారి రెంటి మీదా పడి, ఒకదాన్ని పంజాతో కొట్టి, రెండోదాన్ని తన వాడి కోరలతో పట్టి, రెంటినీ పొట్టన పెట్టుకున్నది.

కాకి ఈ కథ చెప్పి ఇంకా ఇలా అన్నది: ''పగలు కళ్ళు కనిపించని గుడ్లగూబను రాజుగా చేసుకుని, రాత్రి కళ్ళు కనిపించని మీరంతా అలాగే నాశనంఅయిపోతారు. అందుచేత బాగా ఆలోచించి మీ కర్తవ్యం నిర్ణయించుకోండి.''

ఈ మాటలు విని పక్షులు, ''కాకి చెప్పినమాట నిజం. మనం మరొకసారి సమావేశమై, మనకు ఎవరు రాజుగా ఉండాలో నిర్ణయించుకుందాం,'' అనుకుని, తమ స్థావరాలకు ఎగిరిపోయాయి.

దివాంధమైన గుడ్లగూబ మాత్రం తన భార్యతో సింహాసనం మీద కూర్చుని, అభిషేకస్నానంకోసం ఎదురుచూస్తున్నది. కొంతసేపు చూసి అది, ''ఎవరక్కడ? పట్టాభిషేకం ఇంకా పూర్తికాలేదేం?'' అన్నది.

దానికి గుడ్లగూబ భార్య, ''ప్రియా, నీ పట్టాభిషేకాన్ని కాకి పడగొట్టేసింది. పక్షులన్నీ తలా ఒక దారీ అయి వెళ్ళిపోయాయి. ఎందుచేతనో కాకి మాత్రం ఇంకా ఇక్కడే ఉన్నది. ఇకలే. నిన్ను ఇంటికి చేర్చుతాను,'' అన్నది.

ఈ మాట విని గుడ్లగూబ విచారంగా కాకితో, ''ఓ దుర్మార్గపు కాకీ, నేను నీకు ఏం ద్రోహం చేశానని నా పట్టాభిషేకానికి భగ్నం కలిగించావు? ఈనాటి నుంచీ నీ జాతికీ, నా జాతికీ మధ్య బద్ధవైరం



ఉండుగాక! నరికిన అరణ్యం మళ్లీ పెరుగుతుంది గాని పరుషవాక్యాలు చేసిన గాయం ఎన్నటికీ మానదు,'' అని తన భార్య వెంట తన నివాసానికి వెళ్ళిపోయింది.

అప్పుడు కాకి ఇలా అనుకున్నది:

''అయ్యో, ఇవాళ ఇలా మాట్లాడి అనవసరంగా శత్రుత్వం కొనితెచ్చుకున్నాను గదా! స్థల, కాల, పరిస్థితులు పాటించకుండా ఆడిన అనవసరపు మాటలు, అందులోనూ బాధ కలిగించి, మాట్లాడిన వారి నీచబుద్ధిని వ్యక్తంచేసేవి ఉత్తమాటలు కావు, ఘాటైన విషంతో సమానమంటారు. ఎంత బలం గలవాడైనా, వివేకి అయినవాడు బుద్ధిపూర్వకంగా శత్రువులను చేసుకోరాదు. తన వద్ద విరుగుడు ఉన్నది కదా అని వివేకి గరళం తాగుతాడా? తెలివిగలవాడు పదిమందిలో ఇతరులను అవమానించరాదు.''

ఇలా అనుకుంటూ కాకి తన నివాసానికి వెళ్లిపోయింది.

గుడ్లగూబ పట్టాభిషేకం తప్పిపోయిన కథ విని, కాకులకు రాజైన మేఘవర్ణం, ''అయ్యో, ఇది భయంకరమైన జాతివైరమై కూర్చున్నదే! రాజనీతి చతురత గాని, వంచన గాని ప్రయోగించి, తెలివితేటలుగల ఈ గుడ్లగూబలను మంచి చేసుకోవటం సాధ్యమంటావా?'' అన్నది.

''ఎందుకు సాధ్యం కాదు? కొందరు దొంగవెధవలు మోసంచేసి, తెలివితేటలుగల బ్రాహ్మడి మేకను కాజేసిన కథ వినలేదా?''అని స్థిరజీవి అడిగింది.

''ఏమిటా కథ?'' అని మేఘవర్ణం అడిగిన మీదట స్థిరజీవి, బ్రాహ్మణుడి మేక కథ ఇలా చెప్పింది:

మిత్రవర్మ అనే బ్రాహ్మడు నిత్యాగ్నిహోత్ర నియమం గలవాడు. మాఘమాసం వచ్చింది. ఈదురుగాలి వీస్తున్నది. ఆకాశమంతా మబ్బులు కమ్మి, తుంపర పడుతున్నది. అలాంటి

సమయంలో ఆ బ్రాహ్మడు యజ్ఞంచేసి బలి ఇయ్యటానికి మేకను యాచించ టానికి దూరగ్రామం వెళ్ళి, ఒక ధని కుడితో, "అయ్యా, వచ్చే అమావాస్యనాడు నేను ఒక మేకను బలి ఇద్దామను కుంటున్నాను. దయచేసి ఒక మేకను ఇప్పించండి," అని అడిగాడు. ధనికుడు బ్రాహ్మడికి ఒక బలిసిన మేకను ఇచ్చాడు.

బ్రాహ్మడు ఆ మేకను వీధి వెంట తీసుకుపోదామని చూస్తే, అది అటూ ఇటూ పరిగెత్తి, తన స్వస్థలం విడిచి, కొత్తవాడి వెంట వెళ్ళటానికి నిరాకరిం చింది. అతి కష్టంమీద బ్రాహ్మడు మేకను పట్టుకుని, మళ్ళీ అది పారిపోకుండా దాన్ని తన భుజాలమీద వేసుకుని, తన ఊరికి బయలుదేరాడు.

ఆ మేక తప్పించుకు పోవటానికని తన్నుకుంటూ ఉండటం ముగ్గురు పేద దొంగవెధవల కంటపడింది. వాళ్ళు ఆకలితో బాధపడుతున్నారు. వాళ్ళలో వాళ్లు, "మనం ఈ మేకను తినగలిగితే చలిబాధకు తట్టుకోగలుగుతాం. అందు కోసం మనం ఈ పిచ్చి బ్రాహ్మణ్ణి మోసంచేద్దాం," అనుకున్నారు. ఏం చెయ్యాలో నిర్ణయించుకున్న అనంతరం ముగ్గురూ విడిపోయారు.

బ్రాహ్మడు కొంతదూరం వెళ్ళాక ఒక దొంగవెధవ రైతువేషంలో బ్రాహ్మడికి ఎదురుపడి, "అయ్యావారూ, ఆ గజ్జి కుక్కను భుజాల కెత్తుకుని మోస్తున్నా రేమిటి? ఎవరన్నా చూస్తే ఏమను కుంటారు? కుక్కా, కోడీ, చండాలుడూ అంటరానివని పెద్దలు చెబుతారుగదా! తమలాటి సద్బ్రాహ్మలు వాటిని తాక వచ్చునా?" అన్నాడు.

బ్రాహ్మడికి కోపం వచ్చి, "మేకను పట్టుకుని కుక్క అంటావు, నీ కేమన్నా కళ్ళు కనిపించటం లేదా?" అన్నాడు.

"అయ్యా, కోపం దేనికి? అభ్యంతరం లేకపోతే ఆ కుక్కను అలాగే మోసుకు వెళ్లండి," అంటూ వాడు వెళ్లిపోయాడు.



# 189. ప్రాచీన సిరియా ఆలయం

సిరియా లోని బాల్బెక్ వద్ద ఉండిన ఈ "బాకస్" దేవాలయం అన్నిటికన్న అందమైనదీ, తక్కువ శిథిలమైనదీనూ. ఈ ఆలయానికి కనుచూపుమేరలో "క్రూసేడర్లు" దాడులు చేశారుగాని, దీని జోలికి వచ్చారు కారు.





# మాయాసరోవరం

## 21

[తన బద్ధశత్రువైన కృపాణజిత్తు, మృత్యువృక్షానికి బలి అయిపోగానే, జయశీలుడు సిద్ధసాధకుడితో కలిసి మాయాసరోవరం ఎక్కడ వున్నదో వెతికి తెలుసుకునేందుకు బయలు దేరాడు. సర్పనఖుడు వాళ్ళను అనుసరించాడు. ఒక గుహలోంచి బయిటికి వచ్చిన నరవానరాన్ని, జలగ్రహం తొండంతో పట్టుకోవటం వాళ్ళ కంటబడింది. తరవాత—]

జలగ్రహాన్ని చూస్తూనే జయశీల, సిద్ధ సాధకుల్లతోపాటు సర్పనఖుడు కూడా అమితాశ్చర్యం చెందాడు. అతడు జలాశ్వం మీది నుంచి, "జయశీల, సిద్ధ సాధకుల్లారా! జలగ్రహం అనే ఆ నీటి ఏనుగు మహాశక్తి సంపన్నుడైన మకరకేతు వాహనం. ఆయన మాయాసరోవరేశ్వరుడి నుంచి సేవకోత్తమ బిరుదు పొందిన ఘనుడు!" అన్నాడు.

సర్పనఖుడు యిలా అనగానే సిద్ధ సాధకుడు, "జై, మహాకాళా!" అంటూ శూలం పైకెత్తి, "ఒరే, నీటి మనిషీ, యిక నోరు ముయ్యి! ఆ మకరకేతు శక్తి ఏపాటిదో మాకు తెలియంది కాదు. నాకు వాహనం కానున్న నరవానరాన్ని చంపజూస్తున్న ఆ జలగ్రహాన్ని ముందు చంపి, ఆ తరవాత దాని యజమాని అయిన మకరకేతును, మహాకాళుడికి




బలిపెట్టబోతున్నాను,'' అంటూ గుహల కేసి పరిగెత్తబోయాడు.

జయశీలుడు, ''సాధకా, ఆగు, తొందరపడకు!'' అంటూ సిద్ధసాధకుణ్ణి వారించి, తానెక్కి వున్న జలాశ్వాన్ని అతడి ముందుకు నడిపి, చిన్న గొంతుతో, ''సాధకా, మనం మాయాసరోవరాన్ని చేరటానికి యిప్పుడు చక్కని అవకాశం కలగబోతున్నది. ఆ మకరకేతుతో మంచిగా మాట్లాడి, ఏదో విధంగా మనం రాజు కనకాక్షుడి పిల్లలను అపహరించుకు పోయిన మాయాసరోవరేశ్వరుడి దగ్గిరకు చేరాలి. నువు కొంచెం శాంతించు,'' అన్నాడు.

సిద్ధసాధకుడు ఎత్తిన శూలాన్ని దించి, ''ఆ మకరకేతు యింకా బతికి వున్నాడన్న నమ్మకం ఏమిటి? డొక్కలో గుచ్చుకుపోయిన కత్తి, భుజం మీద బోయభీమన్న బాణం చేసిన గాయాలతో, వాడెప్పుడో మరణించి వుంటాడు. ఈ జలగ్రహం యజమానిని కోల్పోయి, యీ కొండల్లో, అరణ్యాల్లో విచ్చలవిడిగా తిరుగుతూండి వుంటుంది,'' అన్నాడు.

జయశీలుడూ, సిద్ధసాధకుడూ యిలా మాట్లాడుతూండగా జలగ్రహం, నరవానరం గుహ ముందున్న మైదాన ప్రదేశంలో భయంకరంగా అరుస్తూ పోరాడుతున్నవి. ఏనుగు తొండం పట్టు నుంచి బయటపడి, నరవానరం దాని వెన్ను మీదికి లంఘించి, వాడి కోరలతో దాని కుంభస్థలాన్ని పీకుతూ, చేతులతో ఎడా పెడా కొడుతున్నది. అంతలో ఏనుగు దాన్ని తొండంతో పట్టి కిందికి యీడ్చి, కాళ్ళతో మట్టగించి చంపాలని ప్రయత్నిస్తున్నది.

''సాధకా, యీ దుష్టమృగాలు రెండూ ఒకదానికొకటి తీసిపోనివి. మకరకేతు మరణించి వుంటాడని ఎందుకనుకుంటున్నావు? అదుగో చూడు, గుహ పైభాగాన వున్న రాళ్ళ మీద ఒకడు కాదు; మొత్తం నలుగురు మనుషులు నిలబడి,

యీ భయంకర పోరాటాన్ని చూస్తు న్నారు,'' అన్నాడు జయశీలుడు.

సిద్ధసాధకుడు జయశీలుడు చెప్పిన వైపుకు దృష్టి సారించాడు. జయశీలుడు చెప్పినట్టు అక్కడ నలుగురు మనుషులు నిలబడి వున్నారు. ఆ నలుగురిలో వేషాన్ని బట్టి ఒక్క మకరకేతునే సాధకుడు పోల్చుకోగలిగాడు. కాని, అక్కడ వున్న మకరకేతుతోపాటు మరిద్దరు జయశీలుణ్ణి గుర్తించారు. అయినా, వాళ్ళల్లో ఒకడు ఆశ్చర్యంతో, మరొకడు భయంతో కళ్ళప్పగించి అలా చూస్తూ వుండిపోయారు.




మకరకేతు అందరికేసీ ఓ మారు చూసి, వాళ్ళల్లో నిండుగా ఒల్లెవాటు వేసుకుని, నల్లని చిన్న గడ్డంతో, వజ్రాలు తాపిన బంగారు పొన్ను కర్ర చేత పట్టుకున్న అతడితో, ''వైద్యదేవా! జలాశ్వం మీద వున్న యువకుడే జయశీలుడు; శూలంపట్టి నేలమీద నిలబడిన వాడు సిద్ధసాధకుడు; ఆ మూడోవాడు–తెలుస్తూనే వున్నది గదా, నా అనుచరుల్లో ఒకడు — ఈ సర్పస్వరుడి అన్న,'' అన్నాడు.

''మా అన్నను ప్రాణాలతో తిరిగి చూస్తానని, నేననుకోలేదు,'' అంటూ సర్పస్వరుడు బయలుదేరబోయేంతలో, మకరకేతు కోపంగా అతడి చేయి పట్టుకుని వెనక్కు లాగాడు.

''ఒరే, సర్పస్వరా, నీకేమైనా మతి పోయిందా? ఆ జయశీలుడూ, సాధకుడూ ఒక రకంగా మనకు శత్రువులు. అయినా, మాయాసరోవరేశ్వరుడి అజ్ఞ ప్రకారం మనం వాళ్ళతో స్నేహం నటించవలసి వున్నది. అందుకు అవసరం అయిన పథకం జాగ్రత్తగా ఆలోచించాలి,'' అని మకరకేతు సర్పస్వరుణ్ణి గట్టిగా కోప్పడి, వజ్రాలు తాపిన చేతికర్ర పట్టుకున్న అతడితో, ''వైద్యదేవా, మీ అభిప్రాయం ఏమిటో సెలవిచ్చారు కాదే?'' అన్నాడు.



ఆ వైద్యదేవుడని పిలవబడిన అతను కొండ దిగువకు ఒకసారి ఆశ్చర్యపోతూ చూసి, ''మకరకేతూ, నువ్వు ఆ మైదానంలో ఏం జరుగుతున్నదో గమనిస్తున్నట్టు లేదు. నరవానరం చేతకాక, నువ్వనే ఆ జయశీలుడి కత్తి దెబ్బకు నీ జలగ్రహం త్వరలోనే ప్రాణాలు విడవబోతున్నది,'' అన్నాడు.

మకరకేతు మైదానం కేసి తల తిప్పి చూసి, ''హాఁ, మాయాసరోవరేశ్వరా!'' అంటూ ఒక కేకపెట్టి, గబగబా కొండ దిగసాగాడు. అతడి వెనకగా తక్కిన వాళ్ళు బయలుదేరారు. వాళ్ళల్లో పాతిక ఏళ్ళ వయసు గలవాడొకడున్నాడు. వాడి కుడి కాలు కొయ్య కాలు. వాడు ఒక లావుపాటి కర్ర చేతబట్టుకుని, దాని ఆసరాతో, తతిమ్మావాళ్ళ వెంట, మెల్లిగా కొండ దిగసాగాడు.

తను వాహనంగా చేసుకుందామనుకున్న నరవానరం, జలగ్రహం ధాటికి తట్టుకోలేక పారిపోజూస్తున్నదని సిద్ధసాధకుడు గ్రహించగానే, అతడు శూలం ఎత్తి మైదానం కేసి బయలుదేరాడు. జయశీలుడు అతణ్ణి హెచ్చరిస్తూ, ''సిద్ధసాధకా, మనం యీ సారి ఒక్క మకరకేతునేగాక, అతడి వెంట వున్న మరి ముగ్గురుని కూడా ఎదుర్కొవలసి రావొచ్చు. తగు జాగ్రత్తలో వుండు,'' అన్నాడు.

''జయశీలా, మనం యీ లోకంలో ఎవరికీ భయపడవలసిన అవసరం లేదు. సాక్షాత్తూ మహాకాలుడి బంటు యిచ్చిన మహత్తు గల కత్తి నీ దగ్గిర వున్నది; ఇక నా శూలం శక్తిని గురించి చెప్పనవసరమే లేదు గదా?'' అన్నాడు.

సర్పనఖుడు వాళ్ళ వెనక జలాశ్వం మీద వస్తూ, ''అయ్యా, ఆ నరవానరాన్ని చంపండిగాని, జలగ్రహానికి మాత్రం హాని చేయకండి. దాని యజమాని పౌరుషశాలి; మహాసత్త్వుడు,'' అని బిగ్గరగా కేకపెట్టాడు.

''నువ్వనే ఆ మహాసత్వుణ్ణి, నా శూలానికి గుచ్చి, చర్మం ఒలవబోతున్నాను, తెలిసిందా? ఇక నోరు మూసుకో,'' అని సాధకుడు పళ్లు కొరికి, ''జై, మహాకాళా!'' అంటూ వేగంగా ముందుకు పరిగెత్తాడు.

సాధకుడు పోరాడుతున్న జంతువులను సమీపించే లోపలే జయశీలుడు జలాశ్వం మీద వాటి దగ్గిరకుపోయి, నేలమీద వెల్లకిలా పడివున్న నరవానరాన్ని జలగ్రహం తొండంతో పట్టుకోబోయే సమయంలో, దాని తొండం మీద కత్తిపిడితో బలంగా కొట్టాడు. ఆ దెబ్బకు జలగ్రహం బాధతో ఒకసారి ఘీంకరించి, జయశీలుడికేసి దూకబోయింది. జయశీలుడు ఒడుపుగా జలాశ్వాన్ని పక్కకు నడిపి, ఎగిరి జలగ్రహం మీదికి దూకాడు.

ఇప్పుడు జలగ్రహం తన శత్రువైన నరవానరాన్ని వదిలి, జయశీలుణ్ణి తన వెన్నుమీది నుంచి కిందికి లాగేందుకు తొండాన్ని తలమీదుగా వెనక్కు తిప్పి, అతణ్ణి పట్టుకోబోయింది. జయశీలుడు ఆ తొండాన్ని ఎడమ చేతితో బిగించి పట్టుకుని, కుడిచేత గల కత్తిపిడితో దాని కుంభస్థలం మీద గట్టిగా మోదసాగాడు.

ఆ సమయానికి మకరకేతు అక్కడికి పరిగెత్తుకుంటూ వచ్చాడు. అతణ్ణి చూస్తూనే జయశీలుడు, ''కేతూ, ముందు నీ జలగ్రహాన్ని హతమార్చి, తరవాత నీ అంతేదో తేలుస్తాను. నీ కారణంగా





నేనూ, సాధకుడూ యీ అరణ్యాలలో నానా యాతనలూ అనుభవించాం,'' అన్నాడు.

''జయశీలా, నీ పుణ్యం వుంటుంది, జలగ్రహాన్ని చంపకు! ఈ క్షణం నుంచీ మనం మిత్రులం. నీకొక్కావలసింది మాయాసరోవరాన్ని ఎలా చేరటం అన్నదే గదా? ఆ మార్గమేదో నేను చెపుతాను.'' అన్నాడు మకరకేతు.

ఆ మాట వింటూనే జయశీలుడు చప్పున జలగ్రహం మీదినుంచి కిందికి దూకి, ''నాకొక్కావలసింది, మాయా సరోవరానికి మార్గమొక్కటే కాదు, అక్కడ బంధించబడి వున్న కనకాక్ష రాజుగారి కొడుకూ, కూతురూ కూడా బంధ విముక్తులు కావటం. అందుకు నిన్నిక్కడ ఏ గుహలోనో బంధించి, నీ ప్రభువు మాయాసరోవరేశ్వరుడికి కబురు చేయటం ఎలావుంటుంది?'' అన్నాడు.

మకరకేతు జవాబిచ్చే లోపలే సిద్ధ సాధకుడు, ''జై, మహాకాళా!'' అంటూ ఒక కేకపెట్టి, ''జయశీలా, నువ్వు చేయనున్న పని దివ్యంగా వుంటుంది. పారిపోకుండా వుండేందుకు వాడి పీక సగం నరికి గుహలో కాళ్ళూ, చేతులూ కట్టి పడెయ్యి. వాడి స్నేహితులు ముగ్గురినీ, యీ నరవానరానికి తరవాత ఆహారంగా వేద్దాం,'' అని నరవానరం గుండెల దగ్గిర చెవిపెట్టి విని, దాని నాడి పరీక్షించి చూసి, ''ఇది చావలేదు. గాని, ఆ నీటి ఏనుగు దెబ్బలకు స్పృహ కోల్పో యింది. ఒరే, ఎక్కడరా నీటి పక్షి సర్పనఖా! వెంటనే నదికిపోయి, ఏదైనా వస్త్రాన్ని బాగా నీళ్ళల్లో తడిపి తీసుకురా,'' అని, సర్పనఖుణ్ణి ఆజ్ఞాపించాడు.

సర్పనఖుడు పొంగే కోపాన్ని అపు కుంటూ, మకరకేతు కేసి చూశాడు. అది గమనించిన సిద్ధసాధకుడు శూలం ఎత్తి పట్టుకుని అతడి దగ్గిరకు వచ్చి, ''ఒరే, నీటి పక్షి వెధవా! ఇక్కడ యజమాని ఎవరనుకుంటున్నావు; నేను!

ఊం చెప్పిన పని త్వరగా చెయ్యి,'' అంటూ హుంకరించాడు.

మకరకేతు మాటా పలుకూ లేకుండా నిలబడి దిక్కులు చూడటం గమనించిన సర్పనఖుడు, వెంటనే కదిలి కొద్ది దూరంలో వున్న నది కేసి వెళ్ళాడు. సిద్ధ సాధకుడు, మకరకేతును సమీపించి, ''ఒరే, కేతూ! నీ వెంట మరి ముగ్గురు నీటి మనుషుల్ని తెచ్చావులా వుంది!'' అంటూ సమీపానికి వస్తున్న వాళ్ళ కేసి చూసి, ''ఆశ్చర్యంగా వుందే; వెంట కొయ్యకాలు వాణ్ణి కూడా తెచ్చావెందుకు?'' అని అడిగాడు.

''సాధకా, అతడు మూలాగా మాయా సరోవర ప్రాంతాల పుట్టి పెరిగినవాడు కాదు, మీ లాంటి మెట్టమనిషే. అతడూ తనకు చేతనైన పద్ధతుల్లో, మీ కనకాక్ష రాజుగారి పిల్లల్ని వెతుకుతూ బయలుదేరి, అరణ్యంలో చిరుతపులి నోటికి చిక్కి, కాలు పోగొట్టుకున్నాడు. అతడి పేరు, మంగళవర్మ,'' అన్నాడు మకరకేతు.

''హిరణ్యపుర సేనాని కొడుకు, మంగళవర్మా? జయశీలుడితోపాటు పోటీపడి, పులులతో పోరాడబోయి పారిపోయిన పిరికి వెధవా?'' అంటూ సిద్ధ సాధకుడు ఆశ్చర్యపోయి, ''జయశీలా, ఆ కొయ్యకాలు వాడు మంగళవర్మ; గుర్తించావా?'' అన్నాడు.

జయశీలుడు, అంతకుముందే మంగళ వర్మను గుర్తుపట్టాడు. కాని, అతడు



మకరకేతు 'వైద్యదేవా!' అని పిలిచే వ్యక్తిని గుర్తించి, సంభ్రమాశ్చర్యాలతో నిలువెల్లా కంపించిపోతూ, "దేవశర్మా!" అని పిలవబోయి నోట మాటపెగలక తత్తరపడుతున్నాడు. అది గమనించిన వైద్యదేవుడనే అతను, చిన్నగా సైగ చేశాడు. దాని అర్థం తనను గుర్తించినట్టు ప్రవర్తించవద్దని.

నదికి నీటికోసం పోయిన సర్పనఖుడు వస్త్రాన్నొకదాన్ని నీట తడిపి, అది నీరోడు తుండగా తెచ్చి సిద్ధసాధకుడి చేతికి యిచ్చాడు. సాధకుడు గబగబా పోయి నీటిని నరవానరం తలమీద పిండి, అరచేతితో దాని తలమీద గట్టిగా కొడుతూ, ''నరవానరా, నువ్వు నిశ్చయంగా బతికే వున్నావు. లే, లే! లోకంలో ఈ సిద్ధసాధకుడి మాటకు తిరుగులేదు,'' అంటూ బిగ్గరగా అరిచాడు.

నరవానరం మరుక్షణం కళ్ళు తెరిచి, చుట్టూ కలయచూసి, అల్లంత దూరంలో నది ఒడ్డున తొండం ఎత్తి నిలబడిన జల గ్రహాన్ని చూస్తూనే, భయంకరంగా అరిచి, లేవబోయింది.

సిద్ధసాధకుడు దాని భుజం పట్టుకుని ఆపి, ''ఒరే, నరవానరా, శాంతించు! నేను, నీకు ప్రాణదానం చేసిన సిద్ధ సాధకుణ్ణి, గుర్తుపెట్టుకో! ఈ నిమిషం నుంచీ నువ్వు, నా బంటువు; వాహనానివి, అవునా!'' అన్నాడు శూలాన్ని దాని పీక మీద అనించి.

నరవానరం లేచి నిలబడి, గుడ్లురుముతూ, పళ్ళుకొరికి, సాధకుడి మీదికి దూకేందుకు సిద్ధపడబోయేంతలో, సాధకుడు దాని నుదుటి మీద అరచేతితో గట్టిగా కొట్టాడు. ఆ దెబ్బ తింటూనే నరవానరం చిన్నగా మూలిగి, వెనుదిరిగి పారిపోబోయినదల్లా ఆగి, చప్పున సిద్ధ సాధకుడి పాదాల ముందు బోర్లాపడి, చేతులు పైకెత్తింది. అది చూసి సిద్ధ సాధకుడు ఆనందం పట్టలేక పొట్ట చెక్కలయేలా నవ్వుతూ, శూలాన్ని గిరిగిరా తిప్పసాగాడు. —(ఇంకా వుంది)





# వేదాంతజ్ఞానం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, కొందరు తమ శక్తికి మించిన పోకడలు పోయి పరాభవం పొంది కూడా, పతనం కాకుండా పరువుగా బతకగలుగుతారు. ఇందుకు నిదర్శనంగా నీకు జమదగ్ని అనే వేదాంతి కథ చెబుతాను. శ్రమ తెలియకుండా విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు :

పూర్వం లక్ష్మిపురం అనే గ్రామంలో జమదగ్ని అనేవాడు పేదరికంతోనూ, ఇతర కష్టాలతోనూ వేగలేక, జీవితంమీద విరక్తి చెంది, సన్యాసులలో చేరిపోయి, దేశసంచారం చేస్తూ, ఒక మహా జ్ఞాని నుంచి వేదాంత జ్ఞానం పొందాడు.

## బేతాళ కథలు



మనిషియొక్క పరమాశయం భగవంతుడిలో ఐక్యం కావటం. ఆ అవకాశం ఉత్తమమైన మానవ జన్మకు మాత్రమే లభ్యం అవుతుంది. రోజూ మనిషి వీలైనంత కాలాన్ని భగవధ్యానంలో గడపాలి. కోరికలనూ, అరిషడ్వర్గాలనూ జయించాలి. ఐహిక లాభాలకోసం అవసరమైన మటుకే శ్రమించి, మిగిలిన కాలాన్ని దైవకార్యాలకు వినియోగించాలి. ఇలా ఉపదేశిస్తూ, దృష్టాంతాలుగా రకరకాల కథలు చెబుతూ దయానంద స్వామి తన ఖ్యాతిని చుట్టుపట్ల గ్రామాలకు కూడా విస్తరింపజేసుకున్నాడు.

అప్పుడు జమదగ్నికి జీవితంలో వేదాంత జ్ఞానం ఇచ్చే ఆనందం మరి దేనివల్లా రాదని తెలిసి వచ్చింది. ఆ ఆనందాన్ని తన ఊరి వారికి అందించాలని అతను మళ్ళీ లక్ష్మీపురానికి తిరిగివచ్చాడు.

ఊళ్ళో అనామకుడుగా ఉండి సన్యాసిగా తిరిగి వచ్చిన జమదగ్నిని ఊళ్ళో వాళ్ళు చాలా గౌరవించారు. ఇప్పుడతని పేరు దయానందస్వామి. అతను రోజూ సాయంత్రంవేళ జనానికి ఉపన్యాసాలియ్యసాగాడు. అతనికి గల జ్ఞానమూ, అతను విషయాలను వివరించే తీరూ జనాన్ని బలంగా ఆకర్షించాయి. అతని ఉపన్యాసాలు వినటానికి జనం తండోపతండాలుగా వచ్చారు.

కాని ఈ ఉపదేశాలు తలకెక్కి లక్ష్మీపురవాసులు సోమరులుగా తయారయారు. వాళ్ళు కష్టపడి పనిచెయ్యటం తగ్గించి, ఇంటింటా పూజలూ, మూక భజనలూ సాగించారు. ఆ ఊళ్ళోనే ఉండే విద్యావంతుడు, రామచంద్రుడు అనే అతనికి ఈ పరిస్థితి నచ్చలేదు. అతను దయానందుడి వద్దకు వెళ్ళి, దైవభక్తి ఉండవచ్చుగాని, అది సోమరితనాన్ని పెంపొందించ రాదన్నాడు. సంకల్ప మాత్రంచేత లోకాలను నడిపించే భగవంతుణ్ణి భజించడం సోమరితనం కాదన్నాడు దయానందుడు. భగవంతుడు తన భక్తులను కాపాడుకోగల

డనీ, రామచంద్రుడు కూడా దైవ ధ్యానంతో పవిత్రుడు కావడం మంచిదనీ సలహా కూడా ఇచ్చాడు!

రామచంద్రుడికి ఇది నచ్చలేదు. గ్రామప్రజలను మార్చాలి. కాని దయానందుడు గ్రామంలో ఉన్నంతకాలమూ వాళ్ళు తన మాట వినరు. అందుచేత అతను మరొక గ్రామానికి చెందిన స్నేహితుడి ద్వారా దయానందుణ్ణి వాళ్ళ గ్రామానికి ఆహ్వానించేటట్టు చేశాడు. దయానందుడు లక్ష్మీపురం వదిలి వెళ్ళాడు.

దయానందస్వామి ఊరు వదిలి పోగానే రామచంద్రు డొక చిన్న నాటకం ఆడించాడు. దాని ఫలితంగా ఒకడికి దేవుడు పూని, ఆ యేడు ఎక్కువ పంట పండించినవాడికి తాను స్వయంగా దర్శన మిస్తానని చెప్పాడు. దయానందుడి ప్రబోధాల ఫలితంగా అమితంగా దైవచింతనలో మునిగి ఉన్న గ్రామస్థులు, భగవంతుడి సాక్షాత్కారం కోసం నడుములు వంచి, ఎన్నడూ పడనంతగా శ్రమపడి పంటలు పండించారు. అందరికన్న హెచ్చు దిగుబడి వచ్చినవాడు రామయ్య అనేవాడు.

పంట ఇంటికి వచ్చిన మర్నాడు రామయ్య ఇంటికి ఎవరో పొరుగూరి బ్రాహ్మడు వచ్చి, భిక్ష కోరాడు. రామయ్య సంతోషంగా ఆ బ్రాహ్మడు కోరినది ఇచ్చాడు. ఆ బ్రాహ్మడు రామ





య్యను నిత్యమూ సంపదలతో తులతూగమని ఆశీర్వదించి వెళ్ళిపోయాడు.

ఆ బ్రాహ్మణ్ణి రామచంద్రుడు ఊరి పొలిమేరలో కలుసుకుని, అతడికి కొంత డబ్బు ముట్టజెప్పి, తాను కోరిన విధంగా చేసినందుకు ధన్యవాదాలు చెప్పుకుని, అతన్ని పంపేసి, రామయ్య ఇంటికి వచ్చి, తానొక అద్భుతం చూశానని రామయ్యతో అన్నాడు.

ఏమిటా అద్భుతం అని రామయ్య అడిగాడు.

"గొప్ప తేజస్సుతో వెలిగిపోతున్న బ్రాహ్మణ్ణి మన ఊరి శివార్లలో చూశాను. నేను నమస్కారం చేసేసరికి ఆయన నవ్వి. 'మీ గ్రామం నాకు చాలా నచ్చింది. ఇక్కడ అందరూ ఒళ్ళు వంచి పని చేస్తారు,' అన్నాడు. అప్పుడు నే నాయనకు అందుకు కారణం చెప్పి, అందరికన్న ఎక్కువ దిగుబడి సాధించిన రామయ్య దైవ దర్శనం కోసం తపించిపోతున్నా డన్నాను. ఆయన మళ్ళీ నవ్వి, 'శ్రమ కూడా పూజలాంటిదే. ఎక్కువ శ్రమపడిన కారణంగా భగవంతుడు రామయ్యకు ఎక్కువ దిగుబడి నిచ్చాడు. ఈ రోజే అతనికి దైవసాక్షాత్కారం కూడా అయింది,' అన్నాడు. నేను ఆశ్చర్యంగా ఆ విషయం కనుక్కుందామని బయలుదేరబోతూ, రామయ్యకు దైవసాక్షాత్కారం అయిన సంగతి ఆయనకు ఎలా తెలిసిందా అని అడుగుదామని చూస్తే, ఆయన ఎక్కడా కనిపించలేదు. ఈ వింతకు ఆశ్చర్యపోతూ ఇలా వచ్చాను," అన్నాడు రామచంద్రుడు.

తన ఇంటికి వచ్చి భిక్ష కోరినవాడే భగవంతుడని రామయ్యకు తోచింది. ఈ వార్త గ్రామమంతా పాకింది. శ్రమ కూడా పూజలాటిదేనని భగవంతుడు స్వయంగా చెప్పాడన్నమాట గ్రామస్థుల మీద బాగా పనిచేసింది. అదీగాక ఆ ఏడాది పంటలు బాగా పండడంతో అందరి పని బాగుండడంచేత ఎప్పుడూ ఇలాగే

శ్రమపడి తమ సంపదలను నిలబెట్టుకోవాలని వారు అనుకున్నారు.

ఇలా కొంతకాలం గడిచినాక దయానందస్వామి ఆ గ్రామానికి తిరిగి వచ్చాడు. ఇదివరకటిలాగా ఊళ్ళో దైవకార్యాలు జరగకపోవడమూ, ప్రజలందరూ ఎవరి పనులలో వాళ్ళు ఉండడమూ, అతనికి చాలా బాధ కలిగించింది. ఆయన తన ఉపదేశాలను తిరిగి తీవ్రంగా ప్రారంభించాలనుకున్నాడు.

అయితే, రామచంద్రుడు ఆయనను కలుసుకుని, మొదటి ఉపన్యాసంలోనే ప్రశ్నలతో ఉక్కిరి బిక్కిరి చేశాడు; ఇంత విశాల ప్రపంచం ఉండగా, లక్ష్మీపురానికే వచ్చి ఉపదేశాలు చెయ్యటానికి కారణం అడిగాడు.

''ఇది నేను పుట్టి పెరిగిన ఊరు," అన్నాడు దయానందుడు.

"అయితే మీకింకా మోహం వదలలేదన్నమాట ! మీకే వదలని మోహం మాకెలా వదులుతుంది ?" అన్నాడు రామచంద్రుడు.

''మోహం ఏమీలేదు. కోరికలతో సతమతమవుతున్న ప్రజలను ఉద్ధరించడం ఎక్కడో అక్కడ మొదలుపెట్టాలి గదా !'' అన్నాడు దయానందుడు.

''కోరికలను జయించాలనుకుంటున్న మీకు ఈ కోరిక తగునా ?'' అని రామచంద్రుడు అడిగాడు.

''స్వార్థరహితమైన కోరిక తప్పు





రామచంద్రుడు అడిగాడు.

దయానందస్వామికి సహనంపోయి, "ఓయీ, నీ వితండవాదనతో నువ్వు దైవదూషణ చేస్తున్నావు. నీలాంటి మూర్ఖులవలన ప్రజలు చెడిపోతారు," అన్నాడు.

"అరిషడ్వర్గాలను జయించిన తమకే మీ మాట కాదన్నందుకు కోపం వస్తున్నదే! మా మానాన మేం బ్రతుకుతూ, ఇంత సంపాదించి మీబోటి జ్ఞానులకు ఆహారం సరఫరా చేస్తుంటే, మీరు మా దారి మార్చుకోమన్నప్పుడు మాకెంత కోపం రావాలి?" అని రామచంద్రుడు అడిగాడు.

కాదు," అన్నాడు దయానందుడు తడబడుతూ.

"అది నిజమైతే, ఈ ఊళ్ళో శ్రమపడుతున్నవాళ్ళు ఎవరూ స్వార్థంకోసమే పాడుపడడంలేదు; తమ భార్యా పిల్లల కోసమూ, తలిదండ్రులకోసమూ శ్రమిస్తున్నారు.........ప్రతి మనిషిలోనూ దేవుడున్నాడుగదా! మనిషిని మనిషి సేవిస్తే దేవుణ్ణి సేవించినట్టే గదా! శరీరాన్ని తపింపజేయడానికి ఉపవాసాలే అవసరం లేదు, కాయకష్టం చేయడంవల్ల శరీరానికి శ్రమ లభించడమేగాక, పదిమందికీ ఇంత ఆహారం లభిస్తుంది! అదిమాత్రం దైవపూజ కాదా?" అని

దయానందుడు మారుమాట్లాడక, చేతులు జోడించి రామచంద్రుడికి నమస్కరించి, "వేదాంతం కాచి వడబోశాననీ, జనాన్ని ఉద్ధరించగలననీ అనుకున్న నా మిడిమిడి జ్ఞానం అర్థమయింది. నన్ను క్షమించండి. ఇక ఈ సన్యాసాన్ని వదిలిపెట్టి, నేను మామూలు మనిషిగా బతుకుతాను," అన్నాడు.

రామచంద్రుడు అతన్ని ఊళ్ళో పిల్లలకు చదువు చెబుతూ ఉండమనీ, అతను సుఖంగా బతకటానికి అన్ని

ఏర్పాట్లూ చేస్తాననీ మాట ఇచ్చి, అలాగే చేశాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, లోకాన్ని తన తప్పుడు జ్ఞానంతో మోస గిస్తున్న దయానందుణ్ణి అతని దారిన పోనియ్యక, రామచంద్రుడు అతనికి ఊరిలో ఉపాధి ఎందుకు కల్పించాడు? అతన్ని వాదనలో ఓడించినందుకు పశ్చాత్తాపంవల్లనా? లేక అతని వేదాంత జ్ఞానంపట్ల ఏ మూలనో కొంత గౌరవం ఉండడం చేతనా? ఈ ప్రశ్నకు సమాధానం తెలిసికూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "రామచంద్రుడు జమదగ్నికి ఊళ్ళో ఉపాధి కల్పించటానికి చాలా కారణాలున్నాయి. ఒకటి, జమదగ్నికి తన ఊరన్న అభిమానం ఉన్నది. ఆ ఊరువల్ల అతను బాగుపడటం భావ్యమే. జమదగ్నికి శిక్ష జరగక పోలేదు; వేదాంత జ్ఞానం బోధించటంనుంచి పిల్లలకు అక్షరాభ్యాసం చెయ్యటానికి దిగటం పతనమేగదా! ఇదంతాగాక అతను ఊరు విడిచి మరొక చోటికిపోతే అక్కడివాళ్ళు బ్రహ్మరథం పట్టి, అతనిచేత మళ్ళీ వేదాంతం చెప్పించవచ్చు. ఇక ఉన్న ఊళ్ళో అతను వేదాంత బోధలు చెయ్యడన్న భరోసా ఉన్నది. అందుచేత రామచంద్రుడు సరిఅయిన పనే చేశాడు. పోతే జమదగ్ని పక్షంనుంచి చూస్తే, ఏ ఊళ్ళోనయితే అతను బతకలేక సన్యాసి అయాడో అదే ఊళ్ళో అతను గురువుగా నలుగురి మన్ననా పొందటం పెద్ద ఉద్ధరింపేగద!" అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు.

—(కల్పితం)






# సొమ్ముసొగ

గోపాలుడు ఆస్థాన విదూషకుడు. అతను తెలివిగలవాడూ, మంచి హాస్యగాడూ కావటంచేత మహేంద్ర మహారాజు కొలువు సరదాగా ఉండేది. మహారాజుకు గోపాలుడంటే చాలా ప్రీతి. కొన్ని సందర్భాలలో అతని సలహాకూడా తీసుకునేవాడు.

అయితే గోపాలుడు దుబారా మనిషి. ఆస్థానంలో అతనికి మంచి జీతం వచ్చేది; అడపా దడపా బహుమానాలు వచ్చేవి. అయినా అతని చేతిలో ఎంత డబ్బూ నిలిచేదికాదు. ఎప్పుడూ డబ్బుకు కటకటగానే ఉండేది.

పెద్ద పండగ వస్తున్నది. అల్లుణ్ణి తీసుకురావాలి, ఘనంగా మర్యాద చెయ్యాలి, బట్టలు పెట్టాలి, కనీసం వారంపాటు విందులు కుడపాలి. కాని ఎలా ? అతని నెలజీతం ఏనాడో హరించిపోయింది. చేతిలో చిల్లిగవ్వలేదు. ఎక్కడన్నా అప్పుపుట్టిద్దామనుకున్నా, అతన్ని ఎరిగినవారెవ్వరూ ఇయ్యరు. అల్లుడికి మర్యాదలు జరపకపోతే పరువు దక్కదు.

ఈ స్థితిలో అతనికి ఐంద్రజాలికుడు సోమనాథుడు జ్ఞాపకం వచ్చాడు. అతని ఇంద్రజాలమే తనని కాపాడాలి !

సోమనాథుడు గోపాలుడికి డబ్బియితే ఇయ్యలేకపోయాడుగాని, మహారాజువద్ద నుంచి డబ్బు లాగే ఉపాయం ఒకటి చెప్పాడు.

గోపాలుడు రోజూ దర్బారుకు వచ్చి తీరాలి. అతని ఛలోక్తులతో సభికులు పగలబడి నవ్వకపోతే దర్బారు ముగియదు. అలాటి పరిస్థితిలో ఒకరోజు గోపాలుడు దర్బారుకు రాలేదు. కారణం కనుక్కోమని మహారాజు

ఏ. సి. సర్కార్, ఐంద్రజాలికుడు

గోపాలుడి ఇంటికి మనుషులను పంపాడు. వాళ్ళు తిరిగివచ్చి ఒక వింత విషయం చెప్పారు: గోపాలుడు ఇంటి దూలానికి వంటపాత్ర వేళ్ళాడగట్టి, నేల మీద మంట చేస్తూ, వంట పూర్తికాగానే భోజనంచేసి వస్తానని మహారాజుకు కబురుచేశాడు.

"వాడికేమైనా మతిపోయిందా ఏం? దూలానికి కట్టిన వంటపాత్ర నేలమీది మంటకు అసలు వేడెక్కుతుందా? ఇదేమిటో విచారించవలసిందే," అని రాజు కొంతమంది సభికులను వెంట బెట్టుకుని గోపాలుడి ఇంటికి వెళ్ళాడు. గోపాలుడు నిజంగానే దూలానికి వంట పాత్ర కట్టి, నేలమీద మంటపెట్టాడు.

"మహారాజా, తమరే వచ్చారా? ఆ పాత్రలో అన్నం ఉడకగానే తిని, నేనే వద్దును గదా!" అన్నాడు గోపాలుడు.

"ఇదో కొత్త హాస్యమా? ఈ మంటకు ఆ అన్నం నీ జన్మలో ఉడుకుతుందా?" అన్నాడు మహారాజు.

"అదేమిటి, మహారాజా? మంట ఇంకా దూరంగా ఉన్నా ఉడికించ గలను," అన్నాడు గోపాలుడు.

"ఆ మాట పదిమందిలో రుజువు చేశావంటే నీకు నూరు బంగారు కాసు లిస్తాను," అన్నాడు రాజు.

"రేపు నిండు సభలోనే రుజువు చేస్తాను. ఈ పూటకు భోజనం చెయ్య



కుండానే వస్తాను. పదండి.'' అన్నాడు గోపాలుడు.

మర్నాడు గోపాలుడు సభకు ఒక లోహపు పాత్రా, మూతా, ఇన్ని బియ్యమూ తీసుకుని వచ్చాడు. అతను పాత్రను మంత్రి కిచ్చి, దాని లోపల శుభ్రంగా తుడిపించాడు. అందులో బియ్యం వేసి, నీళ్ళు పోసి, మూతపెట్టాడు. ఆ పాత్రను చిక్కంతాడుతో పట్టుకోమని ఒక సభికుణ్ణి పురమాయించి, దానికి అయిదారు గజాలదూరాన ఒక కొవ్వొత్తి వెలిగించిపెట్టాడు.

''ఈ కొవ్వొత్తి సెగకు ఆ పాత్రలో బియ్యం ఉడకబోతున్నది," అన్నాడు గోపాలుడు. అతను పాత్రను పట్టుకున్న వాడితో,'' అన్నం ఉడుకుతున్న శబ్దం వస్తున్నదేమో చూడు," అన్నాడు.

సభికుడు ఆలకించి, ఆశ్చర్యంతో, ''మహారాజా నీరు మసలుతున్నది!'' అన్నాడు.

మహారాజు పాత్రను తాకి చూశాడు. అది చాలా వేడిగా ఉన్నది.

''గోపాల్, ఇవిగో నీ నూరు బంగారు కాసులు!" అని మహారాజు అతనికి పందెం డబ్బు ఇచ్చేశాడు.

గోపాలుడి అల్లుడు పండుగకు వచ్చాడు. అతనికి మర్యాదలన్నీ ఏ లోటూలేకుండా జరిగాయి. విందుకు సోమనాథుడు కూడా వచ్చాడు. అతను చేసిన సహాయానికి గోపాలుడు పది బంగారు కాసులు ఇచ్చుకున్నాడు.

సోమనాథుడు చేసిన సహాయం ఏమిటి ?

కాల్చి సిద్ధంగా ఉంచిన తెల్లని సున్నపు రాయిని చితకగొట్టి, బియ్యం ప్రమాణంలో ఉండే పలుకులను బియ్యంలో బాగా కలిపాడు. చప్పున చూసేవారికి అంతా బియ్యంలాగే ఉంటుంది. కాని దాన్ని పాత్రలో పోసి, నీరు పోసి, చప్పున మూతపెట్టగానే, నీరు తగిలి సున్నపురాతి పలుకులు కళపెళలాడుతూ ఉడికాయి. అది చూసి సభికులు బియ్యమే ఉడుకుతున్నదను కున్నారు.



# నిజమైన పిశాచాలు

ఒకసారి శ్మశానంలో పిశాచాలకు ఒక సందేహం వచ్చింది : పిశాచాలు ఎక్కువ చెడ్డవా, లేక మనుషులు ఎక్కువ చెడ్డవాళ్ళా ?

"మనకున్న శక్తిలో ఎన్నోవంతో మనుషులకు లేదు. మనమే చెడ్డవాళ్ళం," అన్నాయి కుర్రపిశాచాలు.

"అనుభవం ద్వారాగాని ఈ ప్రశ్న తేలదు. కొందరు మనుషుల మధ్యకు వెళ్ళి నిజం తెలుసుకురండి," అని ఒక ముసలి పిశాచి, మూడు అనుభవం గల పిశాచాలను నియోగించింది.

అవి తిరిగివచ్చి, మనుషులే దుర్మార్గులని చెప్పాయి. "మనుషులలో దొంగతనమూ, తాగుడూ, జూదాలూలాటి లక్షణాలు కొల్లలు. మనం అవి ఎరగం," అన్నది ఒక పిశాచి.

"మానవుల్లో మోసం, ఒకరి కాళ్ళ కింద ఒకరు గోతులు తియ్యటం చాలా హెచ్చుగా ఉన్నది," అన్నది రెండో పిశాచి.

"మనలో ఉన్న స్నేహం, సౌభ్రాతృత్వం మానవుల్లో లేవు. సాటివాళ్ళను పీడించటమే వాళ్ళకు తెలుసు," అన్నది మూడో పిశాచి.

"మానవులే నిజమైన పిశాచాలు," అన్నది వృద్ధపిశాచి. —కొండలరావు ఎ.






పూర్వం ఒక రాజుగారి సలహాదారుడికి అరవై ఏళ్ళు నిండాయి. దేశాచారం ప్రకారం రాజుగారి కొలువుచేసేవాళ్ళు షష్టిపూర్తి కాగానే ఉద్యోగంనుంచి విరమించుకోవాలి.

విరమించుకుంటున్న పాత సలహాదారుడు రాజుగారితో, ''మహారాజా, పాతికేళ్ళుగా తమ ఉప్పు తింటూ బతికాను. పదేళ్ళుగా నేను నా కొడుక్కు మంచి శిక్షణ ఇస్తూ వస్తున్నాను. వాడు సలహాదారుగా నాకు ఏమాత్రమూ తీసిపోడు. అందుచేత, దయ ఉంచి వాణ్ణి తమ కొత్త సలహాదారుగా వేసుకోండి,'' అన్నాడు.

రాజుగారు నవ్వి, ''దానికేం భాగ్యం? నువు అంతగా చెబుతూంటే కాదంటానా? మీవాణ్ణి కొంతకాలం చూసి, పనికొచ్చేలాగుంటే తప్పక నా సలహాదారుగా నియమిస్తాను,'' అన్నాడు.

తండ్రి విరమించిన మర్నాడే కొడుకు రాజుగారి సలహాదారుగా నియమించబడ్డాడు.

కొద్దిరోజులు గడిచాక రాజుగారు కొత్త సలహాదారును పిలిచి, ''పొరుగు రాజు మనమీద దండెత్తడానికి సన్నాహాలు చేస్తున్నట్టు మన చారులవల్ల నమ్మకంగా తెలిసింది. మనం ఏంచేస్తే బాగుంటుంది?'' అని అడిగాడు.

కొత్త సలహాదారు కొంచెం ఆలోచించి, ''తమరు ఏంచేయాలని అనుకుంటున్నారు?'' అని అడిగాడు.

''మనమే ముందుగా శత్రువుపై దండయాత్రచేస్తే ఎలా ఉంటుంది?'' అని రాజు అడిగాడు.

''అవును! అలా చేస్తే దివ్యంగా ఉంటుంది,'' అన్నాడు కొత్త సలహాదారు.

మాచిరాజు కామేశ్వరరావు

''కాని అలా చేస్తే శత్రువు దుర్బుద్ధి ప్రపంచానికి ఎలా తెలుస్తుంది? తప్పు మనదిలాగే కనిపిస్తుంది గద. మన ప్రజలే మన చర్యను ఆక్షేపించి, మనమే కయ్యానికి కాలు దువ్వామనవచ్చు,'' అన్నాడు రాజు.

''ఆ మాటా నిజమే! ప్రజల సాను భూతి కోరితే మనమే ముందుగా బయట పడి పోరాదు,'' అన్నాడు కొత్త సలహాదారు.

''పోనీ మనం, శత్రువుల యుద్ధ సన్నాహ వార్త రహస్యంగా ఉంచి, మన మానాన మనం ఆహారపదార్థాలు నిలవ చేస్తూ, సైన్యాలను సమాయత్తంచేసి ఉంచి, అకస్మికంగా ధాడిచేశా నను కున్న శత్రువు ఊహించని విధంగా ఎదురుదెబ్బ తీస్తే ఎలా ఉంటుంది?'' అని రాజు అడిగాడు.

''అమోఘమైన ఆలోచన! మీ బుద్ధి కుశలత అద్భుతం!'' అన్నాడు కొత్త సలహాదారు.

రాజు అతన్ని పంపించేసి, పాత సలహాదారును పిలిపించి, ''చూడు, భట్టూ! సలహా లియ్యడం కులవృత్తి కాదు. అది వంశపారంపర్యంగా సంక్ర మించని ఒక అరుదైన కళ. నీ కొడుక్కు నువు శిక్షణ ఇచ్చేటప్పుడు రకరకాల సమస్యలకు చక్కని పరి ష్కారాలు బోధించి ఉంటావు. కాని నీ కొడుక్కు సమస్యను అర్థంచేసుకుని పరిష్కారం సూచించే శక్తి రాలేదు. అతడికి సమస్య మనమే చెప్పి, పరి ష్కారంకూడా మనమే సూచించాలి. ఆ పరిష్కారంలో ఉండే చిక్కులు కూడా మనం చెబితేగాని అతడికి తెలీవు. అది అలా ఉంచి, ఒకే సమస్యకు పరిస్థి తులనుబట్టి పరిష్కారాలు వేరువేరుగా ఉంటాయి. అది తెలుసుకునే తెలివి తేటలు సలహాదారుకు ఉండాలి. నీ కొడుకు సలహాదారుగా ఏమాత్రమూ పనికిరాడు. కాని విచారించకు. అతడికి తగిన ఉద్యోగం చూసి ఇస్తాను,'' అన్నాడు.







# వింత సంఘటన

పూర్వం కళింగదేశాన్ని పాలించిన ఆనందవర్ధనుడికి చాలా కాలం సంతానం కలగలేదు. అందుచేత ఆయన రెండో వివాహం చేసుకున్నాడు. కొద్ది కాలానికే చిన్నరాణి గర్భవతి అయింది. రాజూ, ప్రజలూ కూడా ఆనందభరితులయారు. అదే సమయంలో పెద్దరాణి కూడా గర్భవతి అయినట్టు తెలియవచ్చింది. అందరి సంతోషమూ రెట్టింపు అయింది.

రాజు ఇద్దరు రాణులనూ ఎంతో జాగ్రత్తగా చూసుకుంటూ వచ్చాడు. ఇంతలో ఒక విడ్డూరమైన వార్త రాజభవనంలో వినవచ్చింది. అదేమంటే, ఒక ఏనుగుకు గుర్రంపిల్ల పుట్టిందట! అందరూ ఆశ్చర్యపడి, కలికాలంలో ఇలాటివి జరుగుతాయి కాబోలు ననుకున్నారు.

తరవాత ఇద్దరు రాణులూ ఏకకాలంలోనే ప్రసవించారు. పెద్దరాణి చక్కని పిల్లవాణ్ణి కన్నది, కాని చిన్నరాణికి పిల్లికూన పుట్టింది! మనిషికి పిల్లికూన పుట్టడంకూడా కలిమహిమే కాబోలు ననుకున్నారు. అయితే పెద్దరాణికి కొడుకు కలిగినందుకు రాజు సంతోషించాడు.

ఇది జరిగిన కొద్ది రోజులకు రాజసభకు ఒక జ్యోతిష్కుడు వచ్చి, భూత భవిష్యత్తులు చెప్పగలనన్నాడు. రాజు తన కొడుకు జాతకం చూడమని, ఆ జ్యోతిష్కుణ్ణి పెద్దరాణి మందిరానికి పంపాడు.

జ్యోతిష్కుడు పెద్దరాణి మందిరానికి వెళ్ళి, ఆమె కన్నబిడ్డను చూసి, జాతకచక్రంవేసి, పెద్దరాణితో, "అమ్మా, ఈ పిల్లవాడు కన్నతల్లివద్ద కాక మరొక స్త్రీ వద్ద పెరుగుతాడు, అయితే ఈ పిల్లవాడు

గంగిశెట్టి శివకుమార్

దురదృష్ట జాతకుడు కావటాన ఇతన్ని పెంచే మారుతల్లి ఎంతోకాలం బతకదు," అన్నాడు.

పెద్దరాణి కలవరపడుతూ, "దీనికి విరుగుడు ఏమీలేదా?" అని అడిగింది.

"అమ్మా, గ్రహశాంతులూ అవీ వొట్టి బూటకం. జాతకంలో రాసిపెట్టి ఉన్నది అక్షరాలా జరిగి తీరుతుంది. మిమ్మల్ని అబద్ధాలతో మోసగించి డబ్బుచేసుకునే జ్యోతిష్కుణ్ణి కాను నేను," అన్నాడు జ్యోతిష్కుడు.

"మరి ఎలాగ?" అన్నది రాణి.

"ఇతన్ని పెంచబోయే స్త్రీ ఈ పిల్లవాణ్ణి వదిలించుకుంటే ఆమెకు ప్రాణాపాయం తప్పుతుంది. అంతకన్న మరొక మార్గంలేదు," అన్నాడు జ్యోతిష్కుడు.

పెద్దరాణి జ్యోతిష్కుడికి ఇయ్యవలసినది ఇచ్చి పంపించేసి, తన బిడ్డను తీసుకుని చిన్నరాణి అంతఃపురానికి వెళ్ళి, విచారంగా కూర్చుని ఉన్న రాణిని చూసి, "చూడు, చెల్లీ! నీకు ఇలా అయినందుకు నాకెంతో బాధగా ఉన్నది. వీడు మన ఇద్దరికీ బిడ్డేకదా! నువే వీణ్ణి పెంచు. దిగులుపడకు," అన్నది, తన బిడ్డను ఆమెకు అందిస్తూ.

చిన్నరాణి ఆవేశంతో, "నాకు అంతా తెలుసులే! ఆ దురదృష్ట జాతకుణ్ణి పెంచి నేను నా ప్రాణంమీదికి తెచ్చుకోనా?" అన్నది.

పెద్దరాణి పెద్ద చిక్కులో పడింది.



ఇక అసలు విషయం బయటపెట్టడం ఆమెకు తప్పనిసరి అయింది. ఆమె ఇలా అన్నది:

"చెల్లీ, నన్ను నువు క్షమించాలి. ఈ బిడ్డ నీకు పుట్టిన బిడ్డే! నాకు బిడ్డలు లేరని రాజుగారు నిన్ను పెళ్ళాడారు. నువు గర్భవతివని విని చాలా అసూయ పడ్డాను. నువు రాజమాతవు అయితే నాగతి ఏంకాను? అందుకని నేను ఒక పథకం ఆలోచించి, నేను కూడా గర్భవతినని పుకారు లేవదీసి, ముందు ముందు నేను చెయ్యదలచుకున్న మోసం గురించి ఎవరికీ అనుమానం కలగకుండా, ఏనుగు గుర్రంపిల్లను కన్నట్టు ఒక వదంతి దివాణంలో ప్రచారం చేయించాను. తరవాత నువు ప్రసవించిన బిడ్డను నా పక్కలోకి మార్పించి, నీ పక్కలో పిల్లి కూనను పెట్టించాను. ఇలా ద్రోహంచేసి నందుకు పశ్చాత్తాపపడుతున్నాను. నన్ను క్షమించి, నీ బిడ్డను నువు తీసుకో."

చిన్నరాణి తన బిడ్డను తీసుకుంటూ, "అక్కా, విచారించకండి. జరిగిన దేదో జరిగింది. నాకు మొదట మీమీద అనుమానం లేదుకాని, నాకు పిల్లికూన పుట్టిందన్న తరవాత నాకు మీమీద అనుమానం కలిగింది. వెనక్కు తిరిగి చూసుకుంటే, నాతోబాటే మీరూ గర్భవతి కావటమూ, ఏనుగు గుర్రంపిల్లను కన్నదన్న పచ్చి అబద్ధం ప్రచారంకావటమూ నా అనుమానాన్ని బలపరిచాయి. నిజం బయటికి లాగాలన్న ఉద్దేశంతో నేనొక జ్యోతిష్కుణ్ణి ప్రయోగించాను. నిజానికి అతను జ్యోతిష్కుడు కాడు. నేనిచ్చే బహుమానానికి ఆశపడి, నేను చెప్పమన్నట్టు చెప్పాడు. అతని ద్వారా నేను ఆడిన నాటకం సఫలమయింది. మీరన్నట్టు వీడు మన ఇద్దరికీ బిడ్డే. అందుచేత మీరు పశ్చాత్తాప పడనవసరంలేదు. మీరొక నాటకం ఆడితే నేను ఇంకో నాటకం ఆడాను. అందుచేత నాకు మీమీద ఏమీ కోపంలేదు," అన్నది.





# కింజల్పపక్షులు

పూర్వం కాశీరాజు వద్ద మంత్రిగా ఉండిన ఉగ్రసేనుడి కొడుకు కాదరపింగు వట్టి తిరుగుబోతు. ఒకరోజు అతను తన పనికిమాలిన స్నేహితులతో వారణాశి నగరంలో తిరుగుతూ, రాజపురోహితుడైన పుష్యుడి భార్యను పద్మను చూశాడు. ఆమె రీవీ, అందమూ అతన్ని మోహ పరవశుణ్ణి చేశాయి.

ప్రేమ పక్షులకు సహాయం చేయడంలో పేరు గడించిన తటిల్లత అనే ఆమెను కాదరపింగు ఆశ్రయించి, తనకు పద్మను ఎలాగైనా కూర్చుమన్నాడు. మంత్రిగారి కొడుక్కు సహాయపడటం లాభసాటిగానే ఉంటుంది, కాని మంత్రిగారికి తెలియకుండా ఇలాటి వ్యవహారాలలో జోక్యం కలిగించుకోవటం ప్రమాదకరం కావచ్చు. అందుచేత తటిల్లత ఉగ్రసేనుడి వద్దకు వెళ్ళి ఆయన కొడుకు తనను కోరిన కోరిక గురించి చెప్పింది.

ఉగ్రసేనుడు ఉగ్రుడైపోవటానికి బదులు సంతోషించి, తటిల్లతను ప్రోత్సహించి, తన కొడుకు కోరిక నెరవేర్చమని ముందుగానే ఆమెకు కొంత డబ్బు ఇచ్చాడు. ఇందుకు కారణం ఏమంటే, రాజుకు మంత్రి మీదకన్న పురోహితుడైన పుష్యుడి పైన ఎక్కువ విశ్వాసమూ, అభిమానమూనూ. అదీగాక పుష్యుడూ, అతని భార్యా ఆదర్శ దంపతులుగా పేరుపడ్డారు. పుష్యుడికి సగం ఖ్యాతి భార్య మూలానే కలిగింది. అలాటప్పుడు పుష్యుడి భార్య నడత మంచిది కాదని లోకానికి తెలిసేలాగా చేయగలిగితే పుష్యుడు మరి తల ఎత్తుకుని తిరగలేడు.

తటిల్లత పద్మ ఇంటికి వెళ్ళి, తార్పుడుగత్తె చాకచక్యమంతా ప్రదర్శిస్తూ పద్మను

తటిల్లత ఉగ్రసేనుడి వద్దకు వెళ్ళి, ''రాజ పురోహితుడు కొన్నాళ్ళు ఊళ్ళో లేకుండా చెయ్యాలి,'' అన్నది.

ఉగ్రసేనుడు రాజుగారి దగ్గిరికి వెళ్లి, ''మహాప్రభూ, కింజల్వ పక్షులు అనే విచిత్రమైన పక్షులను గురించి విన్నాను. అవి చక్కని రంగులు కలిగి, మానవ భాష మాట్లాడతాయట. ఒక కింజల్వ పక్షి ఉన్నవాడు చక్రవర్తి అవుతాడట. మనం వెంటనే ఒక పక్షిని సంపాదించటం మంచిదని నాకు తోస్తున్నది,'' అన్నాడు.

''అవి ఎక్కడ దొరుకుతాయి?'' అని రాజు అడిగాడు.



ప్రోత్సహించింది. తటిల్లత వేసిన ఉచ్చులో పడటానికి పద్మ ఏ మాత్రం అభ్యంతరమూ చూపక, తనను అంతగా మోహిస్తున్న వారెవరని అడిగింది. ఆమె అంత సులభంగా తన దారికి వచ్చినందుకు తటిల్లత ఆశ్చర్యపడుతూ, ''నిన్ను మోహించిన వాడు మంత్రి కుమారుడు కాదరపింగు. అతని కోరిక తీర్చాలి,'' అన్నది.

''ఈ విషయం రహస్యంగా ఉంటుందా?'' అని పద్మ అడిగింది.

''ఉండదు,'' అన్నది తటిల్లత.

''ఫరవాలేదు. నువు అవసరమైన ఏర్పాట్లన్నీ చెయ్యి,'' అన్నది పద్మ.

''హిమాలయాలలో రత్నశిఖండ శిఖరం దగ్గిర ఉన్నాయని తెలిసింది. వాటిని మంత్రశక్తితో పట్టాలి. మన పుష్యుడు అందుకు సమర్థుడు,'' అన్నాడు ఉగ్రసేనుడు.

కింజల్వ పక్షిని తీసుకురావటానికి రాజ పురోహితుణ్ణి పంపటం నిర్ణయమయింది. రాజాజ్ఞ విని పురోహితుడు ఇల్లు చేరాడు. అతని ముఖంలో విషాదం చూసి పద్మ కారణం అడిగింది. పుష్యుడు ఆమెకు అంతా చెప్పి, ''ఇందులో ఏదో మోసం ఉన్నది. ఐతే రాజాజ్ఞ!'' అన్నాడు.

''ఇందులో రాజుగారి ద్రోహం లేక పోవచ్చు. నేను చెప్పినట్టు చెయ్యండి.

రేపు ఉదయం మీరు హిమాలయాలకు బయలుదేరినట్టు బయలుదేరి, అర్ధరాత్రి సమయానికి రహస్యంగా ఇంటికి తిరిగి రండి. కొద్దిరోజులు మీరు రహస్యంగా దాగి ఉంటే ఆ పక్షుల సంగతి నేను చూసుకుంటాను,'' అన్నది పద్మ.

పుష్యుడు ఆమెను ఎలాటి ప్రశ్నలూ వెయ్యకుండా, ఆమె చెప్పినట్టు చెయ్యటానికి ఒప్పుకున్నాడు. అతను మర్నాడు ఉదయం బయలుదేరి వెళ్ళి, అర్ధరాత్రి వేళకు మారువేషంలో ఇంటికి తిరిగి వచ్చి, లోపలి గదిలో చేరాడు.

ఆ మర్నాడు సాయంకాలం చీకటిపడే వేళకు తటిల్లత కాదరపింగును వెంట బెట్టుకుని రాజపురోహితుడి ఇంటికి వచ్చింది. పద్మ రంభలాగా ముస్తాబై, వారిని లోపలికి ఆహ్వానించి, పరుపులు వేసి ఉన్న సోఫాలో కూర్చోబెట్టింది. కూర్చుంటూనే వారిద్దరూ సోఫా కింద ఉన్న గోతిలో పడిపోయి లబోదిబో మన్నారు. సోఫా పరుపుల కింద ఆధారం ఏమీలేదు. పద్మ గోతి మీద మూతవేసి, వాళ్ళను అందులో మూడు రోజులు ఉండనిచ్చింది; మధ్యాన్నంవేళ ఇద్దరికీ ఇంత తిండి మాత్రం పడేసింది.

నాలుగో రోజున ఆమె, తన భర్త రెండు కింజల్ప పక్షులను మంత్రశక్తితో పట్టుకుని తిరిగివస్తున్నట్టు వార్త వచ్చిందని రాజుగారికి కబురు చేసింది. ఈవార్త క్షణంలో ఊరంతా పాక్కి, కింజల్ప



పక్షులను చూడటానికి రాజుతోబాటు ప్రజలు కూడా తహతహలాడిపోయారు.

పద్మ తన ఖైదీలను నౌకర్లచేత గోతిలో నుంచి పైకి తీయించి, వాళ్ళ శరీరాల నిండా రకరకాల పక్షుల రంగురంగుల ఈకలను అంటింపజేసి, ఇద్దరినీ ఒక కొయ్యబోనులో పెట్టి, ఊరి బయట అడవి లోకి చేరేటట్టు చేసింది.

మర్నాడు పొద్దునే రాజపురోహితుడు కింజల్క పక్షులతో హిమాలయాల నుండి తిరిగివచ్చి, ఊరి బయట ఉన్నట్టు ఊళ్ళోకి వార్త వచ్చింది. రాజోద్యోగులూ అనేకమంది ఇతరులూ రాజపురోహితుడికి ఎదురు వెళ్ళి, బోనుతోసహా అతన్ని రాజుగారి సన్నిధికి తెచ్చారు.

పుష్యుడు రాజుతో, ''మహాప్రభూ, ఈ కింజల్క పక్షుల జంటను చూడండి. ఒకటి ఆడది, ఒకటి మగది. ఇవి మానవభాష మాట్లాడతాయి,'' అన్నాడు.

రాజుగారు బోనును సమీపించి ''పక్షులను'' చాలాసేపు పరికించి చూసి, ఆశ్చర్యపోయాడు. అవి సిగ్గుతో తల వంచుకున్నాయి.

కొంతసేపయాక రాజు, ''నాకు అద్భుత పక్షులు కనిపించటం లేదు. ఒంటి నిండా ఈకలు అంటించుకుని కాదరపింగూ, తటిల్లతా కనిపిస్తున్నారు,'' అన్నాడు.

''కింజల్క పక్షులను గురించి క్షుణ్ణంగా తెలిసినవాడు ఉగ్రసేనుడు. ఆయన వివరంగా చెబుతాడు,'' అన్నాడు పుష్యుడు.

ఉగ్రసేనుణ్ణి రప్పించారు. ఆయన తన కొడుకునూ, అతడి తార్పుడుగత్తెనూ చూసి భయంతో వణుకుతూ నిలబడి, రాజుగారి ముఖం చూడలేకపోయాడు.

పద్మ రాజుగారికి కథ అంతా చెప్పింది. రాజు ఆమెనూ, ఆమె భర్తనూ కొనియాడి, దుర్మార్గులకు తగిన విధంగా బుద్ధి చెప్పినందుకు ఆమెను చక్కగా సన్మానించాడు. ఉగ్రసేనుడి పదవిపోయింది. అతని కొడుకునూ, తటిల్లతనూ రాజు మందలించి విడిచిపెట్టాడు.



# మృత్యుభయం

ఒక స్వామీజీని భక్తుడు భిక్షకు పిలిచి, షడ్రసోపేతంగా భోజనంపెట్టి, "స్వామీ, పొద్దున లేస్తే ఎన్నో పాపాలు చెయ్యకుండా జరగని ఈ క్షుద్రప్రపంచంలో మీరు పాపరహితంగా, నిర్మలంగా ఎలా జీవించగలుగుతున్నారో సెలవిస్తారా?" అని అడిగాడు.

"ఆ సంగతి అలా ఉంచు. సరిగా వారం రోజులకు నీ ఇంట చావు సంప్రాప్తం కానున్నది," అని స్వామీజీ వెళ్ళిపోయాడు.

భక్తుడు హడలిపోయి, తన ఆస్తిపాస్తులు ఎలా పంపకం జరగాలో, ఏ బాకీలు తీర్చాలో, ఏవి వసూలు చెయ్యాలో తన కుటుంబానికి వివరంగా చెప్పి, తాను జపానుష్ఠానంలో అహోరాత్రాలు గడపసాగాడు. వారం రోజులూ గడిచాయి. స్వామీజీ చెప్పిన రోజు వచ్చింది.

భక్తుడు స్వామీజీని చూడబోదామనుకుంటూండగా స్వామిజీయే వచ్చాడు.

"నాయనా, ఈ వారం రోజుల్లో ఎన్ని పాపాలు చేశావు?" అని అయన అడిగాడు.

"చావును ఎదురుగా పెట్టుకుని పాపాలు చెయ్యగలనా, స్వామి? ఒక్క పాపం కూడా చెయ్యలేదు," అన్నాడు భక్తుడు.

"నీకు చావు వస్తుందని నేను చెప్పలేదే? ఇవాళ నీ అవు చచ్చిపోతుంది. నీ ప్రశ్నకు సమాధానం నువే చెప్పావు. నా బోటి వాళ్ళు చావును క్షణం కూడా మరవలేరు. అందుచేత పాపాలు చెయ్యకుండా, నిర్మలంగా జీవించగలరు," అన్నాడు స్వామీజీ.

—ఎం. ఆర్. కె. నాయర్.





రామాపురం రైతులు నిరక్షరులూ, అమాయకులూనూ. తమకు ఎవరు ఏమాత్రం ఉపకారంచేసినా దానికి మూడింతలు ప్రత్యుపకారం చెయ్యటమే గాక, కలకాలం చెప్పుకునేవారు. ఈ అమాయకులను దోచుకోవడానికి గ్రామంలో ముగ్గురువ్యక్తు లుండేవారు.

ఒకడు కరణం కనకాచారి. పొలాల క్రయవిక్రయాలలోనూ, దస్తావేజుల రాతకోతల్లోనూ, "ఈ పొలం ఇలా అమ్మటానికి వీల్లేదు. కొత్త నిబంధనల ప్రకారం ఈ వారసత్వపు హక్కుపత్రం చెల్లదు....ఇంకా శిస్తులు కట్టడానికి బోలెడంత వ్యవధిఉన్నది....అయ్యో,మరీ ఇంత ఆలస్యంగానా? అపరాధ రుసుము కట్టాలి," అంటూ కరణం జనాన్ని దోచేవాడు. అయితే తాను గ్రామ ప్రజల అందరి క్షేమం కోరేవాడిననీ, పాపభీతీ, దైవభక్తీ గలవాడిననీ జనాన్ని నమ్మించేవాడు.

రెండోవాడు మునసబు శరభయ్య. అతను పేదరైతులకు లేదనకుండా అడిగినంతగా అప్పులిచ్చి, ధర్మవడ్డీ పేర దొంగలెక్కలువేసి, చక్రవడ్డీ కాజేసేవాడు. "పాపం, ఎంత అవసరంలేకపోతే వాళ్లు డబ్బు అప్పు పుచ్చుకుంటారు! నేనైనా చూస్తూ, చూస్తూ ఇదంతా మూటగట్టుకుపోతాను గనకనా?" అని దొంగ కబుర్లు చెప్పేవాడు.

మూడోవాడు వైద్యుడు వరదాచారి. చిన్న చిన్న జ్వరాలకూ, రోగాలకూ పెద్ద పెద్ద భయంకరమైన పేర్లు పెట్టేవాడు. చిన్న జ్వరాన్నే తన మందులతో ప్రకోపింపజేసి, చివరకు, "ఇక లాభంలేదు. చివరిప్రయత్నంగా సువర్ణభస్మం వాడవలసిందే! నాకేమీ ఇయ్యక్కర్లేదు,

---

ఎం. డి. సౌజన్య

పిడకలకూ, భస్మాలు పుటంవేయటానికి అయిన ఖర్చు ఇస్తే చాలు,'' అనేవాడు.

ఈ ముగ్గురూ ఈ విధంగా అమాయకులైన గ్రామప్రజల్ని రకరకాలుగా దోచేవారు.

ఇలా ఉండగా, కరణం కనకాచారి కొడుకు నరహరికి అకస్మాత్తుగా జబ్బు చేసింది. ఒకవంక పెళ్ళి ప్రయత్నాలు జరుగుతుండగా ఈ ఉపద్రవమేమిటని కరణం వైద్యుడు వరదాచారిని పిలిపించాడు.

వరదాచారి వస్తూనే నరహరి నాడి పరీక్షించి పెదవి విరిచి, ''విషజ్వరం. అలస్యంచేస్తే ప్రమాదం.అగస్త్యమూలికా శాస్త్రంలో చెప్పినప్రకారం సువర్ణభస్మం వాడి తీరవలసిందే, తప్పదు ! నాలుగు నవర్సుల బంగారం ఇప్పించండి,'' అన్నాడు.

కొడుకు మంచంపక్కనే ఉన్నకరణం భార్య కామాక్షమ్మ తన చేతిగాజులు తీసి ఇచ్చింది. భార్యనోటికి వెరిచే కరణం, వరదాచారి మోసగిస్తున్నాడని అనుమానించినా ఏమీ చేయలేకపోయాడు.

ఒకవారం రోజులపాటు నరహరి జబ్బు ప్రకోపించి, రెండోవారంలో పూర్తిగా తగ్గిపోయింది. అదంతా తన సువర్ణ భస్మం ప్రతిభే నన్నాడు వరదాచారి.



ఇలా ఉండగా, ఒకరోజు అర్ధరాత్రి, వరదాచారి రొప్పుతూ కరణం ఇంటికి పరిగెత్తుకొచ్చి, ''కరణంగారూ, నా కొంప మునిగింది. మాఇంట్లో ఇప్పుడే దొంగలు పడి, వెండి బంగారాలతోపాటు, మా అక్కయ్య చచ్చిపోతూ మా అమ్మాయి లక్ష్మిపేర రాసిన అయిదుఎకరాల కొబ్బరి తోట తాలూకు హక్కుపత్రం ఎత్తుకుపోయారు. ఆ తోట కట్నంగా ఇచ్చి దాని పెళ్ళి చేద్దామనుకున్నాం!'' అంటూ గుండెలు బాదుకుని ఏడ్చాడు.

''ఆ హక్కుపత్రం బూటకపుది అని ఫిర్యాదులు వచ్చాయి. ఆ హక్కుపత్రం మీరే సృష్టించుకుని, మీ అక్కయ్య

చావగానే అవిడ వేలిముద్ర వేయించు కున్నారని నిన్ననే రాజధానినుండి ఫిర్యాదు వచ్చింది. ఈ విషయం రహ స్యంగా పరిశోధించి, నివేదిక పంపమని కొత్వాలు నన్ను కోరాడు,'' అన్నాడు కరణం.

వరదాచారి గడగడ వణికిపోయి, ''ఆస్తికోసం బుద్ధి గడ్డితిన్నది. దాయా దుల బెడద తప్పుకోవడానికి అలా చేశాను. నిజం బయటపడితే, చిక్కుల పాలైపోతాను. ఇప్పుడిక మీరే నన్ను గట్టున పడేయాలి," అన్నాడు.

కరణం కాస్త ఆలోచించి, ''సరే, మీ అమ్మాయికి చెందిన ఆ హక్కుపత్రం ఇంకొకరికి ఎలాగూ పనికిరాదు. అది లేకపోవటంవల్ల మీకు కొబ్బరితోటమీద హక్కు ఉండదు, అంతే! నేను రాజ ధానికి వెళ్లి, కొత్వాలుకూ అతని సిబ్బందికీ లంచాలుపెట్టి మీ పత్రం దొంగిలించినవాణ్ణి పట్టి, అది తిరిగి మీకు చెందేటట్టు చూస్తాను. ఇదంతా మూడోకంటికి తెలియకుండా జరిగి పోవాలి. బాగా ఖర్చుతో కూడుకున్న పని!'' అన్నాడు.

"వెండీ, బంగారమూకూడా పోయింది. శరభయ్య దగ్గిర ఓ వెయ్యిరూపాయలు వడ్డీకి తీసుకుంటాను. ఈ ఆపదనుంచి నన్ను కాపాడండి,'' అన్నాడు వరదా చారి దీనంగా.

''వెయ్యితో పనికాదు, వరదాచారి



గారూ. కొత్వాలుల సంగతి మీకు తెలిసిందేగా? మీకు నష్టమూ, నాకు శ్రమా తప్పేటట్టు ఒక పథకం చెబుతాను. మీ కిష్టమైతే అలా చెయ్యండి,'' అన్నాడు కరణం. ఆ పథకానికి వరదాచారి వెంటనే ఒప్పుకున్నాడు.

మర్నాడు అర్ధరాత్రివేళ, వరదాచారి ఉండే పెద్ద పూరిల్లు తగలబడిపోయింది. ఊరిజనం పోగై మంటలు ఆర్పారుగాని, యీ లోపల సమస్తమూ బూడిద అయిపోయింది.

వరదాచారి భార్య, ''అయ్యయ్యో, బంగారంలాంటి ఇల్లు! పిల్ల పెళ్ళికి చేర్చిపెట్టుకున్న సరుకులన్నీ బూడిద అయిపోయాయే. అమ్మాయి పెళ్ళి ఏంపెట్టి చేద్దామండీ?'' అని ఏడ్చి, గుండెలు బాదుకున్నది.

''ఇక ఈ ఊళ్ళో క్షణం ఉండొద్దు! ఒక్క దమ్మిడీ తీసుకోకుండా నేను ఊళ్ళోవాళ్ళకు వైద్యంచేస్తుంటే చివరకు నా ఇల్లే తగలబెడతారా?'' అంటూ వరదాచారి తన భార్యతోనూ, కూతురితోనూ కోపంగా అప్పటికప్పుడే బయలు దేరాడు.

ఇదంతా నిర్ఘాంతపోయి చూస్తూ నిలబడిన గ్రామప్రజలు వినేటట్టుగా మునసబు శరభయ్య, ''ఆచారిగారూ, ఆగండి! ఎవడో దుర్మార్గుడు చేసిన పనికి మీరు గ్రామాన్నంతా నిందించటం భావ్యంకాదు. మేమంతా చందాలు



వేసుకుని, మీకు నిప్పు భయమూ, నీరు భయమూ లేని డాబా కట్టించి పెడతాం. మీరు వెళితే మాకు వైద్యం చేసేదెవరు?'' అన్నాడు ఆవేశంగా.

వరదాచారి ఏమీ అనలేదు.

మునసబు జనంకేసి తిరిగి, ''నే నన్నది నిజమేనా? మీరూ ఒప్పుకుంటారా?'' అని అడిగాడు. అందరూ తలలూపారు.

''అయితే, ఎవరు ఎంతెంత చందా వేస్తారో ఇక్కడే ఇప్పుడే చెప్పెయ్యండి. మీరు వేసే చందాలకు సరిపడా, మీకు నేను డబ్బిస్తాను. రేపు పంటలు రాగానే ధర్మ వడ్డీతో తీర్చుకుందురుగాని,"

రైతులు పోటీలుపడి తమ విరాళాలు ప్రకటించారు. నిమిషాలమీద, మంచి డాబా కట్టడానికి చాలిన చందా పోగయింది. పనివాళ్ళు తక్కువకూలి తీసుకుని రెండునెలల్లో వరదాచారికి డాబాఇల్లు కట్టి ఇచ్చారు.

తరవాత ఒక నెలకు, కరణం కనకాచారి కొడుకూ, వైద్యుడు వరదాచారి కూతురికీ ఘనంగా వివాహం జరిగింది. వరదాచారి శాశ్వతంగా రామాపురంలో ఉండిపోయేటట్టు చూడటానికి శరభయ్యే ఈ వివాహం కుదిర్చాడు. అంతేకాదు, రెండుపక్షాలా అయనే పెళ్లిపెత్తనం కూడా చేశాడు.

''తెల్లవారితే ఈ ముగ్గురితో పని! వీళ్ళు లేకపోతే మనం క్షణం బతకలేం,'' అని గ్రామస్థులు తమశక్తికొద్దీ పెళ్ళి చదివింపులు చదివించారు. అందుకు కావలసిన డబ్బు శరభయ్యే అప్పుగా ఇచ్చాడు!

పెళ్లిసందడి సద్దుమణిగిన మూడో రోజున కరణం కనకాచారి రాజధాని నుండి తిరిగివచ్చి, ''చూశారా, బావగారూ? ఇదుగో నా కోడలి హక్కుపత్రం! ఎలాగో తిరిగి దొరికింది. ఇదంతా ఆవిడ అదృష్టం!" అంటూ దాన్ని వరదాచారికి చూపాడు.

ఒక పథకం ముందుగానే వేసుకుని కనకాచారే దాన్ని దొంగిలించిన సంగతి ఎవరికీ తెలియదు.

"మొత్తానికి సాధించారు, బావగారు! అసాధ్యులు!'' అని వరదాచారి కరణాన్ని మెచ్చుకున్నాడు.



# దొంగభక్తి

రాముడు అల్లరిచిల్లరగా తిరిగేవాడు. వాడింటి సమీపంలో గుడి ఉన్నది. అక్కడ తరచు జరిగే ఉత్సవాలూ, భజనలూ అంటే వాడికి మహా సరదా. వాడు చాలా భక్తిగలవాడనుకుని పూజారి వాణ్ణి చేరదీసి, ప్రసాదాలు బాగా పెట్టేవాడు.

రాముడు సమయం చూసి ఒకనాడు గుడిలోని బంగారు లోటా దొంగిలించాడు. రాముడే దొంగ అని పూజారి గ్రహించి కూడా వాణ్ణి ఏమీ అనలేదు. రాముడికి ధైర్యం వచ్చింది. ఒకరోజు వాడు పూజారి దగ్గిర చాలా డబ్బు చూసి, అది ఎక్కడిదని అడిగాడు.

"దేవుడి కిరీటం అమ్మేశాను. ధర్మకర్త నన్నేమీ అనలేదు. అయినా దేవుడి మాన్యం మీద పడి తింటున్నవాడేగా? దొంగే!" అన్నాడు పూజారి.

రాముడు ఇంటికిపోయి బంగారులోటా తెచ్చి పూజారికి ఇచ్చి, "దీన్ని అమ్మిపెట్టండి. వచ్చినది చెరినగం తీసుకుందాం," అన్నాడు.

పూజారి లోటా తీసుకుని గుడిలో పెట్టి, "నిన్ను పట్టుకుందుకేరా అబద్ధాలు చెప్పాను. మేమెవరమూ దొంగలం కాము. ఇక ఎన్నడూ ఈ గుడి చాయలకు రాకు," అన్నాడు.

—చెల్లూరి సీతారాజేశ్వరరావు.





ఒక పట్టణంలో శ్రీగుప్తుడు అనే వర్తకుడు ఉండేవాడు. ఒకసారి దూరపు బంధువుల ఇంట్లో పెళ్ళి జరుగుతుంటే, శ్రీగుప్తుడు ఆ గ్రామానికి కాలినడకన బయలుదేరాడు.

అతనికి దారిలో రంగన్న అనేవాడు కలిశాడు. రంగన్నది దగ్గిరలోనే ఒక గ్రామం. అతను కూరగాయలు పండించి, రోజూ పట్నంలో వాటిని అమ్మి, స్వగ్రామానికి తిరిగి పోతూంటాడు. రంగన్నను శ్రీగుప్తుడు ఎరగక పోయినా, శ్రీగుప్తుణ్ణి రంగన్న ఎరుగును.

వాళ్ళు వెళ్ళే దారికి కొంచెం పెడగా ఒక ''దయ్యాల" భవంతి ఉన్నది. ఒకప్పుడది జమీందారుల లోగిలి. అయితే ఒకసారి వాళ్ళ దాయాదులు కొందరు దుండగుల సహాయంతో అపరాత్రివేళ ఆ ఇంటిమీదపడి, జమీందారుల వంశాన్ని హత్యచేసి, ఇల్లు దోచుకునే ప్రయత్నం చేశారు. జమీందారీ వంశంవాళ్ళు కొందరు ప్రాణాలతో తప్పించుకుని పారిపోయారు గాని, ఇల్లుమాత్రం కొల్లగొట్టబడి, కాలక్రమాన శిథిలమయేస్థితికి వచ్చింది. ఆ భవంతి దారికి కొంత పెడగా ఉండడంవల్లనైతేనేం, అందులో దయ్యాలుంటాయన్న భయంవల్లనైతేనేం, ఎవరూ అటుకేసి వెళ్ళేవాళ్ళుకారు.

రంగన్న శ్రీ గుప్తుడితో, ''అయ్యా, ఈ పాడుబడిన లోగిలి లోపల ఎలా ఉంటుందో చూడాలని రోజూ అనిపిస్తుంది. కాని ఒంటరిగా అందులోకి పోవటం చూస్తే ఎవరన్నా ఏమనుకుంటారో అని సంకోచిస్తాను. ఇద్దరం ఉన్నాం గనక ఆ ఇల్లు చూసి వద్దామా ?" అన్నాడు.

''దయ్యాల భయం అని చెప్ప

ఎం. వి. వి. సత్యనారాయణ

రాదూ?" అన్నాడు శ్రీగుప్తుడు నవ్వుతూ.

''నాకు అలాటి భయాలేవీ లేవు లెండి. నేను దయ్యాలను నమ్మను. లోపలికి పోయి చూసివద్దాం, రండి,'' అన్నాడు రంగన్న.

ఇద్దరూ ఆ పాడుబడిన భవంతిలో ప్రవేశించారు. కొన్ని గోడలు వర్షాలకు చీకి, అక్కడక్కడా కూలిపోయాయి. చీకటిగా ఉన్న భాగాలలో గబ్బిలాలు చేరాయి. ఎక్కడ చూసినా బూజు వేళ్ళాడుతున్నది. ఇల్లు భయంకరంగా ఉన్నది. అయినా వాళ్ళిద్దరూ ఒకరిని చూసి ఒకరు ధైర్యం తెచ్చుకుంటూ లోపలి గదులలోకి వెళ్ళారు.

ఇంతలో సింహద్వారం విరిగి, గోడ ద్వారానికి అడ్డంగా కూలిపోయింది. ఆ భయంకర శబ్దానికి భవంతి అంతా దద్దరిల్లింది.

శ్రీగుప్తుడు వణికిపోతూ, ''దయ్యాలు! మనని ఈ ఇంటనే పూడ్చి పెట్టేస్తాయి! నీ మూలానే ఇందులోకి వచ్చి, ప్రాణాల మీదికి తెచ్చుకున్నాం!'' అని ఆక్రోశించాడు.

రంగన్న నవ్వి, ''దయ్యాలూ కాదు, భూతాలూ కాదు. రాత్రి కురిసిన వానకు గోడలు నాని, కూలిపోయాయి. అవి మనమీద కూలనందుకు సంతోషించండి! మన ప్రాణాల కేమీ భయం లేదు," అన్నాడు.



''సరే, మనం బయటికి పోయే మార్గం చూడు," అన్నాడు శ్రీగుప్తుడు.

రంగన్న పడిపోయిన గోడలమీదుగా ఎక్కి, బయటికి వచ్చాడు. అతని వెనకనే శ్రీగుప్తుడు కూడా వచ్చాడు.

రంగన్నకు విరిగిన గోడలో ఒక చిన్న చెంబు దొరికింది. దాని మూతికి తాపడం చేసిన రేకు సగం ఊడింది. రేకు పూర్తిగా లాగేసి, చెంబును బోర్లిస్తే, కొన్ని రాళ్ళు కిందపడ్డాయి. శ్రీ గుప్తుడు వాటిని చేతిలోకి తీసుకుని ఆడించి, అవేవో విలువైన రాళ్ళు అని గ్రహిం



చాడు. రంగన్నను మోసగించి, వాటిని తానే సంగ్రహించాలని అతనికి ఆలోచన కలిగింది.

''చూడు, రంగన్నా! ఇలాటి చెంబులు మూడుగాని, అయిదుగాని సింహద్వారంలో తాపడం చేస్తారు. అలా చేస్తే శుభంట! ఇంకా ఉన్నాయేమో చూసిరా,'' అన్నాడు శ్రీగుప్తుడు.

రంగన్న మళ్ళీ పడిపోయిన గోడ మీదికి ఎక్కి, కొంతసేపటికి ఉత్త చేతులతో వచ్చాడు. ఈలోగా శ్రీగుప్తుడు చెంబులో రాళ్ళు మూటగట్టి, అందులో మామూలు రాళ్ళు వేసి ఉంచాడు.

రంగన్న రాగానే ఆ రాళ్ళను శిథిలాలలోకి విసిరివేసి, ''ఇవేవో పంచ లింగాలు. ఎవడికి కావాలి ఈ బోడి లింగాలు?'' అని శ్రీగుప్తుడు చెంబును రంగన్న కిచ్చి, ఉంచుకోమన్నాడు.

శ్రీగుప్తుడు విసిరిన రాళ్ళలో ఒకటి రంగన్న కాళ్ళదగ్గిర పడింది. కాని దాని పక్కనే మరొక రాయి రంగన్నకు కనిపించింది. అది చెంబులోది కాదు.

''ఒక బోడిలింగాన్ని జ్ఞాపకార్థం ఉంచుకుంటాను,'' అంటూ రంగన్న వంగి, ఆ కొత్తరాయిని తీసి, చెంబులో వేసుకున్నాడు.

శ్రీగుప్తుడు చెంబులోని అసలు రాళ్ళను కాజెయ్యటానికే తనను శిథిలాల మధ్యకు పంపాడని రంగన్న గ్రహించాడు. కాని ఆ సంగతి తనకు తెలిసినట్టు అతను పైకి కనబడనియ్యలేదు.

తరవాత ఇద్దరూ ఎవరి దారిన వారు వెళ్ళారు. రంగన్న మర్నాడు పట్నంలో కూరలు అమ్ముకుని, శ్రీగుప్తుణ్ణి చూడబోయాడు. రంగన్నను చూడగానే శ్రీగుప్తుడు కంగారుపడ్డాడు. రంగన్న అనుమానం రూఢి అయింది.

రంగన్నకు పట్నంలో పగటివేషాలు వేసే స్నేహితుడు ఒకడున్నాడు. ఒకప్పుడు అతని కుటుంబంవాళ్ళు

బాగా బతికారుట. అతని పేరు వసంత రాజు. రంగన్న వసంతరాజుకు జరిగిన దంతా చెప్పి, శ్రీగుప్తుడికి తగిన శాస్తి జరగాలన్నాడు. వసంతరాజు అందుకు ఉపాయం ఆలోచించాడు.

అతను ఆ సాయంకాలం ఖరీదైన దుస్తులు వేసుకుని, పెద్దమనిషిలా శ్రీగుప్తుడి దుకాణానికి వచ్చాడు. శ్రీగుప్తుడు శిథిలాలమధ్య దొరికిన రాళ్ళను సానపట్టిస్తున్నాడు. అవి ముడి వజ్రాలు. చాలా ఏళ్ళనాటివి కావటం చేత మట్టిపట్టి రాళ్ళలాగా ఉన్నాయి.

వసంతరాజు శ్రీగుప్తుడితో, ''అవి వజ్రాలా ఏం ? మన వజ్రాలకు అరేబియాలో వల్లమాలిన గిరాకీ ! నేను అరేబియాలో వజ్రాలు అమ్మి లక్షలు గడించాను,'' అన్నాడు.

''వజ్రాలకు ఎలా విలువకడతారు ?" అని శ్రీగుప్తుడు అడిగాడు.

''అందుకు వజ్ర దుర్భిణి అనే పరికరం ఉన్నది. వజ్రాలను ఒక కుండలో వేసి, నీళ్ళు పోసి, ఒక రోజల్లా ఉంచాలి. మీకు కావాలంటే దాన్ని ఒక రోజుపాటు మీ కిస్తాను,'' అన్నాడు వసంతరాజు.

శ్రీగుప్తుడు తనకు దొరికిన రాళ్ళను వసంతరాజుకు చూపించి, ''వీటి విలువ మీ వజ్ర దుర్భిణిలో తెలుస్తుందా ?'' అన్నాడు.




వసంతరాజు వాటిని తన చేతిలోకి తీసుకుని, పైకీ, కిందికీ ఆడించి, ''తప్పక తెలుస్తుంది. ఇవి పాతకాలం నాటి వజ్రాలు. ఇప్పుడిలాటివి దొరకడం లేదు," అన్నాడు.

''మీ వజ్ర దుర్భిణి నాకు అమ్ముతారా ?'' అని శ్రీగుప్తుడు అడిగాడు.

''అసంభవం ! ప్రపంచంలో ఇవి నాలుగే ఉన్నాయి. అందులో నాది ఒకటి,'' అంటూ వసంతరాజు తన వెంట తెచ్చిన పెద్ద పెట్టెనుంచి ఒక చిన్న రంగురంగుల పెట్టె తెరిచి, ''వజ్రాలు ఇందులో వెయ్యండి,'' అన్నాడు.

శ్రీగుప్తుడు వజ్రాలను అందులో వేశాడు. వసంతరాజు చప్పున ఆ పెట్టెను మూసి, పెద్దపెట్టెనుంచి కొంత భస్మం తీసి శ్రీగుప్తుడికి ఇచ్చి, దీన్ని మీ చేత్తో పెట్టెమీద చల్లండి.'' అన్నాడు. శ్రీగుప్తుడు అలాగే చేశాడు.

వసంతరాజు పెద్దపెట్టెకు తాళం వేసి, చిన్నపెట్టెను శ్రీ గుప్తుడికి ఇస్తూ, దీన్ని కుండలో పెట్టి నీళ్ళు పొయ్యండి. నేను రేపు ఈ వేళకువచ్చి, నా పెట్టె తీసుకుంటాను,'' అంటూ సెలవు పుచ్చుకున్నాడు.

వసంతరాజు తిన్నగా రంగన్న ఇంటికి వెళ్ళి, వజ్రాలను అతనికి ఇచ్చాడు. ''ఈ వజ్రాలనుఅమ్మి, చెరిసగం పంచుకుందామా ?" అన్నాడు రంగన్న.

''ఒకప్పుడు ఈ వజ్రాలకోసమే రక్తపాతం జరిగింది. ఒక పెద్ద కుటుంబం చెల్లాచెదరైపోయింది,'' అన్నాడు వసంతరాజు.

''అది నీకెలా తెలుసు ?" అన్నాడు రంగన్న.

''ఈ వజ్రాలు మా తాత సంపాదించి, వంశనాశనం కొనితెచ్చుకున్నాడు,'' అన్నాడు వసంతరాజు విచారంగా.

''అలా అయితే వీటిని నువే ఉంచుకో," అన్నాడు రంగన్న.

''అదేమిటి, రంగన్నా ? నీ మూలంగానే గదా వీటి ఆచూకీ నాకు తెలిసింది. మా వంశం నాశనం అయినాక నాకు వీటిమీద ఏంమోజు ఉంటుంది ? నువ్వన్నట్టు వీటిని అమ్మి, డబ్బు చెరిసగం తీసుకుందాం,'' అన్నాడు వసంతరాజు.

మర్నాడు శ్రీగుప్తుడు నీటినుంచి చిన్నపెట్టెను తీసి చూస్తే, అందులో రాళ్ళు తప్ప ఇంకేమీలేవు. తనదగ్గిరికి వచ్చిన పెద్దమనిషి తనకు భస్మం ఇచ్చేటప్పుడు తన వజ్రాల పెట్టెను మార్చి ఇంకోటి ఇచ్చాడని గ్రహించి శ్రీగుప్తుడు గొల్లుమన్నాడు.

శ్రీగుప్తుడు చూస్తుండగానే రంగన్న పట్నంలో పెద్ద లోగిలి కట్టించి, లక్షల మీద వ్యాపారం చేశాడు.





# వీర హనుమాన్

రామరావణయుద్ధం చూడవచ్చిన దేవతలూ, గంధర్వులూ రాముడి పరాక్రమం గురించీ, వానరులు చేసిన భయంకర యుద్ధం గురించీ మాట్లాడుకుంటూ, తమతమ ప్రదేశాలకు వెళ్ళిపోయారు.

రాముడు, మాతలిని గౌరవించి, అతణ్ణి ఇంద్రుడి రథంతోసహా స్వర్గానికి పంపేశాడు. తరవాత లక్ష్మణుణ్ణీ, సుగ్రీవుణ్ణీ వెంటబెట్టుకుని తన శిబిరానికి వెళ్ళాడు. అక్కడ లక్ష్మణుడితో, ''లక్ష్మణా! మనం యిప్పుడు విభీషణుణ్ణి లంకారాజ్యాభిషిక్తుణ్ణి చెయ్యాలి. అందుకవసరం అయిన ఏర్పాట్లు త్వరగా చేయించు,'' అన్నాడు.

లక్ష్మణుడు, వానరులకు సువర్ణకలశాలిచ్చి, వాళ్ళచేత సముద్రజలం తెప్పించాడు. అతను స్వయంగా విభీషణుణ్ణి తీసుకుపోయి సింహాసనం మీద కూర్చోబెట్టి, జలంతో అభిషేకించాడు. విభీషణుడి మంత్రులూ, అతనిపట్ల భక్తిగల రాక్షసులూ జయజయధ్వానాలు చేశారు. ఆ సమయంలో విభీషణుడు తాను పరిపాలించనున్న రాక్షసుల భయం పోగొట్టి, యిక నుంచి లంకానగరం సుఖశాంతులతో తులతూగగలదని వాగ్దానం చేశాడు. రాక్షసపౌరులు అతడికి కానుకలు సమర్పించారు. విభీషణుడు కృతజ్ఞతా సూచకంగా రామలక్ష్మణులకు దివ్యమైన అనేక వస్తువులను కానుకలుగా యిచ్చాడు.

**36. విభీషణ పట్టాభిషేకం**



విభీషణుడు తన కోరిక ఈడేరినందుకు కృతజ్ఞతా భావంతో ఇచ్చిన కానుకల మీద ఏ మాత్రమూ మనసులేకపోయి నప్పటికీ రాముడు విభీషణుడి తృప్తి కోసం వాటన్నిటినీ స్వీకరించాడు.

తరవాత రాముడు తన సమీపంలో చేతులు జోడించి, మహా పర్వతంలాగా నిలబడి ఉన్న హనుమంతుడితో, "రాక్షస రాజైన ఈ విభీషణుడి అనుమతితో నువు లంకానగరానికి వెళ్ళి, రావణుడి ఇంట ఉన్న సీతకు విజయాభి వందనం తెలిపి, నా చేత రావణుడు చచ్చాడనీ, నేను లక్ష్మణ సుగ్రీవుల వెంట ఉన్నాననీ చెప్పు. ఈ శుభవార్త ఆమెకు చెప్పి, ఆమె సంగతి సమాచారం తెలుసుకుని తిరిగిరా," అన్నాడు.

ఆ ప్రకారమే హనుమంతుడు దారి పొడుగునా రాక్షసుల మర్యాదలు అందు కుంటూ లంకానగరం ప్రవేశించాడు. అతను రావణుడి మందిర ప్రాంగణానికి వెళ్ళి, ఒక చెట్టు కింద రాక్షస స్త్రీల నడుమ విచారంగా కూర్చుని ఉన్న సీతను చూశాడు.

అతను దగ్గిరికి వచ్చి, తన పేరు చెప్పుకుని నమస్కారం చేసి, చేతులు కట్టుకుని నిలబడగానే సీత ముందు గుర్తుపట్టలేదుగాని, తరవాత జ్ఞాపకం వచ్చి, ఆనందం చెందింది. ఆమెలో మార్పు గమనించి హనుమంతుడు, రాముడు చెప్పమన్న మాటలు ఇలా చెప్పాడు :

"సీతాదేవీ, రాముడు క్షేమంగా ఉన్నాడు. అతను విభీషణ, సుగ్రీవుల వెంట వానరసేన మధ్య ఉన్నాడు. తాను శత్రువును వధించి, తన ఆశయం నెరవేర్చుకుని క్షేమంగా ఉన్నానని నీతో చెప్పమన్నాడు. రాముడు రావణుణ్ణి చంపటానికి విభీషణుడి సహాయమూ, వానర వీరుల పరాక్రమమూ, లక్ష్మణుడి నీతిబలమూ తోడ్పడ్డాయి. రాముడు నీ క్షేమం అడిగి, నీతో ఇలా చెప్పమన్నాడు:

'నీకు శుభవార్త చెప్పి, సంతోషం కలిగిస్తాను. పాతివ్రత్య ధర్మం తెలిసిన నువు నా అదృష్టంకొద్దీ ప్రాణాలతో ఉన్నావు. నా పరాక్రమం వల్ల విజయం కలిగింది గనక, ఇక నువు నిశ్చింతగా ఉండు. విచారం మాను. రావణుడు చచ్చాడు. లంకానగరం మన వశమయింది. నేను దృఢనిశ్చయంతో సముద్రానికి సేతువు గట్టి, రావణుణ్ణి చంపుతానన్న శపథం నిలబెట్టుకున్నాను. లంక ఇప్పుడు విభీషణుడి అధీనంలో ఉన్నది. నువు రావణుడి ఇంట ఉన్నందుకు భయపడే పనిలేదు. అది ఇప్పుడు నీ ఇల్లే. నిన్ను చూడటానికి విభీషణుడు రాబోతున్నాడు.' "

ఈ మాటలు విని సీత ఆనందాతిరేకంతో లేచి నిలబడింది, కాని ఏమీ జవాబు చెప్పలేకపోయింది.

అది చూసి హనుమంతుడు, "దేవీ, ఏమిటి ఆలోచిస్తున్నావు? నే నన్నదానికి ఏమీ జవాబు చెప్పవేం?" అని అడిగాడు.

సీత వణుకుతున్న గొంతుతో, "నా భర్త విజయవార్త నీ నోట విని, ఆనందం పట్టలేక నాకు నోట మాట రాలేదు. ఇలాటి ప్రియవార్త తెచ్చినందుకు నిన్ను అభినందించటానికి, ఎంత ఆలోచించినా, మాటలు తట్టటం లేదు. పోనీ నీకు



బహుమానం ఇద్దామంటే అందుకు తగిన వస్తువు మూడులోకాలలోనూ కనబడదు," అన్నది.

హనుమంతుడు ఆమెకు నమస్కరించి, "ఈ మాట మరొకరు అనలేరు. నీ భర్త విజయం కోరిన నీకే చెల్లింది! నీ మాటలే నాకు ఉత్తమోత్తమమైన బహుమానం. రావణుణ్ణి చంపిన రాముణ్ణి చూస్తేనే నాకు ఇంద్రపదవి లభించినంత సంతోషం కలిగింది," అన్నాడు.

సీత కూడా హనుమంతుణ్ణి ప్రశంసించింది. హనుమంతుడు ఆమెతో, "నువు ఒప్పుకుంటే, నిన్ను క్రూరంగా చూసిన రాక్షసస్త్రీల నందరినీ చంపెయ్యాలని



నాకు కోరికగా ఉన్నది,'' అన్నాడు. తలుచుకున్న కొద్దీ అతనికి ఆ రాక్షస స్త్రీలను అప్పటికప్పుడే చిత్రవధ చెయ్యాలని ఉన్నది.

సీత ఆ సంగతి గ్రహించి హను మంతుడితో, '' ఈ రాక్షస స్త్రీలు రావణుడి దాసీలు. రాజును సేవించుకుని బతికే వాళ్ళు, రాజాజ్ఞ పాలించాలిగద! అలా చెయ్యకపోతే వాళ్ళు శిక్ష పొందరా? అందుచేత వారి మీద కోపగించటం అక్రమం. నా గ్రహచారం బాగులేకనూ, నేను పూర్వజన్మలో చేసుకున్న పాపాలకు ఫలితంగానూ కష్టాలు అనుభవించానను కోవాలి. అందుచేత నాకు ఈ రాక్షస స్త్రీల మీద ఎలాటి కోపమూ లేదు. రావణుడు చచ్చాడు గనక వీళ్ళు నన్ను ఇప్పుడేమీ చేయలేరు. ఈ రాక్షసస్త్రీలు తమ దుర్బుద్ధి కొద్దీ నన్ను బాధించారే అనుకున్నా వారిని శిక్షించటం యుక్తం కాదు,'' అన్నది.

హనుమంతుడు సీత మాటలను మెచ్చు కుని, ''నువు అన్నివిధాలా రాముడికి తగిన భార్యవు. అతనికి ఏం చెప్పమంటావో చెప్పి, నన్ను పంపించు,'' అన్నాడు.

''నాకు నా భర్త అయిన రాముణ్ణి చూడాలని ఉన్నది,'' అన్నది సీత.

ఆ సందేశం తీసుకుని హనుమంతుడు అతి వేగంగా రాముడి వద్దకు వచ్చేశాడు. అతను రాముడితో, ''ఎవతె కోసం సేతువు కట్టి, ఇంత యుద్ధం చేశామో, ఆ సీతను చూశాను. ఆమె నన్ను గుర్తిం చింది. మనకు విజయం లభించిందంటే చాలా సంతోషించింది. రావణాసురుణ్ణి చంపిన రాముణ్ణీ, లక్ష్మణుణ్ణీ చూడాలని ఉన్నదని చెప్పింది,'' అన్నాడు.

ఈ మాట విని రాముడు కంట తడిపెట్టి, ''అంతకాలం రావణుడి ఇంట ఉండిన సీతను స్వీకరించానంటే లోకం ఆడిపోస్తుంది; నిర్దోషి అయిన సీతను త్యజించానంటే పాపం చుట్టుకుంటుంది. ఏం చేసేటట్టు?'' అన్నాడు.

అతను వేడి నిట్టూర్పులు విడుస్తూ, సమీపంలోనే ఉన్న విభీషణుడితో, "నువు సీత చేత అభ్యంగన స్నానం చేయించి, శరీరమంతా మంచి పూతలు పూయించి, చక్కగా నగలతో అలంకరించి వెంటనే ఇక్కడికి తీసుకురా," అన్నాడు.

విభీషణుడు వెంటనే లంకానగరానికి వెళ్ళి, తన అంతఃపురస్త్రీల చేత సీతకు కబురు చేయించి, ఆమెను చక్కగా స్నానం చేసి, అలంకరించుకుని రమ్మనీ, ఆమెను ఆమె భర్త చూడగోరుతున్నాడనీ చెప్పించాడు.

తాను తన భర్తను ఉన్నపాళంగానే చూడగోరుతున్నానని సీత విభీషణుడికి తెలిపింది. అలా కాదు, రాముడు కోరినట్టుగానే చెయ్యాలన్నాడు విభీషణుడు. సీత అందుకు సరేనన్నది.

విభీషణుడు సీత చేత తలంటి స్నానం చేయించి, శరీరానికి అంగరాగాలు పూయించి, సమస్తమైన ఆభరణాలతో అలంకరించి, దివ్యమైన బట్టలు కట్టించి, పల్లకీలో ఎక్కించి, అనేకమంది రాక్షసులను ఆమెకు తోడు ఇచ్చి, రాముడి వద్దకు చేర్చాడు.

విభీషణుడు రాముడితో, "సీతను తెచ్చాను," అని చెప్పినప్పుడు రాముడు, ఆ సంగతి ముందుగా తెలిసి కూడా



విచారంగా కూర్చుని ఉన్నాడు. అతన్ని ఒకేసారి మూడు భావాలు పట్టి పీడించాయి; ఇంత కాలానికి సీత మళ్ళీ కనిపిస్తున్నదన్న సంతోషమూ, ఆమెను ఎలా విసర్జించటమా అన్న విచారమూ, అంతకాలం రాక్షసుడి ఇంట ఉన్న దాన్ని ఎలా ఏలుకోవటమా అన్న రోషమూనూ!

రాముడు కొంచెం ఆలోచించి, విభీషణుడితో, "సీతను నా ఎదటకి తీసుకురా!" అన్నాడు.

విభీషణుడు వేత్రహస్తుల చేత అక్కడ మూగి ఉన్న వానర, భల్లూకాలను దూరంగా తొలించాడు. రాముడది చూసి, వాళ్ళను తరమవద్దని వారించి, "వీళ్ళు



పరాయివాళ్లు కారు, నా వాళ్లే. ఎందుకిలా మందలను తోలినట్టు తోలిస్తున్నావు? సీతను వీళ్లు కూడా చూడనీ! తప్పేమిటి?" అన్నాడు.

విభీషణుడు పశ్చాత్తాపపడుతూ, సీతను రాముడి వద్దకు తెచ్చాడు.

రాముడి మాటలు వింటున్న లక్ష్మణుడికీ, సుగ్రీవుడికీ, అతనిలో సీత మీద ప్రేమ అన్నది ఉన్నట్టు తోచక, బాధ కలిగింది. రాముడి వాలకం చూస్తుంటే వారికి భయంకరంగా తోచింది.

సీత సిగ్గుతో ముడుచుకుపోతూ విభీషణుడి వెంట రాముడి ఎదటికి వచ్చింది. అంతమంది మధ్య ఉండటం చేత ఆమె చెంగు ముఖానికి అడ్డం పెట్టుకుని, "ఆర్యపుత్రా!" అని ఏడవ నారంభించింది. అదేసమయంలో ఆమెకు, ఇంతకాలానికి తిరిగి తన భర్త కనిపించాడన్న సంతోషం కూడా కలిగింది. ఆమె దుఃఖం క్రమంగా ఉపశమించింది.

రాముడికి మాత్రం సీతను చూడగానే కోపం పుట్టుకొచ్చింది. అతను ఇలా అన్నాడు: "సీతా, యుద్ధంలో శత్రువును వధించి, నిన్ను విడిపించి, నా పౌరుషం నిరూపించుకున్నాను. శత్రువు పొగరు అణచి, అతను నాకు చేసిన అవమానానికి ప్రతిక్రియ చేశాను. నా ప్రయత్నం నెరవేరింది. నా శపథం నుంచి నాకు విముక్తి లభించింది. రావణుడు నిన్ను ఎత్తుకుపోయిన కారణం చేత నాకు కలిగిన అవమానాన్ని కడిగేసుకున్నాను. హనుమంతుడు సముద్రాన్ని దాటటమూ, లంకను దహించటమూ, ఇంకా అతను చేసిన అనేక ఘనకార్యాలు ఇప్పుడు సఫలమయాయి. అలాగే యుద్ధంలో సుగ్రీవుడు నాకు చేసిన సహాయం సఫలమయింది. నన్నే నమ్ముకుని, నాతో చేరిన విభీషణుడి శ్రమ కూడా సఫలమయింది."

రాముడు తనను గురించి ఒక్కమాట అనకపోవటం చూసి సీతకు దుఃఖం ఆగ

లేదు. ఆమె దుఃఖం చూసినకొద్దీ రాముడికి కోపం హెచ్చిపోయింది. అతను ముఖం చిట్లించి, ''సీతా, అవమానానికి గురి అయినవాడు చేయదగినదంతా చేశాను. కాని ఇదంతా నేను నీ కోసం చేయలేదని గ్రహించు. సదాచారం రీత్యా నువు నాకు విరుద్ధమైన మనిషివి. అందుచేత నేను అనుమతిస్తున్నాను, నువు నీ యిష్టం వచ్చిన చోటికి వెళ్ళవచ్చు. నాకు నువు అవసరం లేదు. చాలా కాలం పర పురుషుడి ఇంట ఉన్న స్త్రీని పరాక్రమమూ, అభిమానమూ గలవాడు ఎలా స్వీకరిస్తాడు? నువు రావణుడి ఒడినుంచి దిగి వచ్చిన దానవు! రావణుడి కళ్ళను నీ అందంతో ఆనందింప చేసిన దానవు! గొప్ప వంశంలో పుట్టి, ఆ వంశానికి కీర్తి తీసుకురావలసిన నేను నిన్ను ఎలా ఏలుకోగలను? నాకు నీ మీద భ్రమ ఏమీ లేదు. నీ యిష్టం వచ్చిన చోటికి నువు వెళ్ళవచ్చు. నేనీమాట బాగా ఆలోచించి మరీ చెబుతున్నాను. కావాలంటే నీ జరుగుబాటు కోసం లక్ష్మణుడి దగ్గిర ఉండు, లేదా భరతుడి దగ్గిర ఉండు. సుగ్రీవుడి వద్ద గాని, విభీషణుడి వద్దగాని ఉండు. నీకు ఎక్కడ సుఖంగా ఉంటుందని తోస్తే అక్కడే ఉండు. నువు మహా అందమైనదానివి! కుదురైన శరీరం గలదానివి! నీ వంటిది అసహాయురాలుగా తన ఇంట ఉంటే, మహాబలుడైన రావణుడు మన్మదబాధ సహిస్తూ, నిన్నేమీ చేయకుండా ఉంటాడని నేను అనుకోలేను,'' అన్నాడు మహా పరుషంగా.

ఎన్నడూ అలాటి మాటలు అనిపించుకోని సీత, ఎవరూ వినదగని మాటలు రాముడి నోట రావటమూ; తాను ఇంత కాలమూ యమచెర అనుభవించి, ప్రియమైన మాటలు చెవిన పడతాయని ఎంతో ఆశించే సమయంలో ఇలాటి మాటలు వినపడటమూ చూసి, కత్తితో నరికిన లతలాగా కంపించిపోయి, కన్నీరు కార్చసాగింది.





# బాబరూ - అతడి శత్రువూ

భారతదేశ చరిత్రలో బాబర్‌గా (బాబర్ అంటే సింహం) ప్రసిద్ధుడైన జహీరుద్దీన్ మహమ్మద్, మధ్య ఆసియాలోని ఫర్గానాకు రాజు. అతడు తన పదకొండవ యేటనే రాజరికానికి వచ్చాడు. ఒకసారి అతడు సమర్కండ్‌నగరం మీదికి దాడి వెళ్ళాడు. ఆ సమయంలో శత్రువులు ఫర్గానాను ఆక్రమించుకున్నారు.



చిన్న రాజ్యాన్ని పోగొట్టుకుని బాబరు కొద్ది సైన్యంతో బయలుదేరి కాబూల్‌ను జయించాడు. తరవాత పంజాబ్ గవర్నరైన దౌలత్‌ఖాన్ ఆహ్వానించగా అతడు హిందూదేశం మీదికి దాడి వెడలాడు. ఆ సమయంలో అతడి సైనికులు పన్నెండువేలు మాత్రమే. కాని అతడి వద్ద శక్తివంతమైన ఫిరంగి బలం వుండేది.



1526 వ. సంవత్సరంలో బాబరు పానిపట్టు వద్ద, అప్పటి ఢిల్లీ సుల్తానయిన ఇబ్రహీం లోడీతో యుద్ధానికి తలపడ్డాడు. సుల్తాన్ సైనికబలం ఒక లక్ష. కాని, సైనికుల్లో క్రమశిక్షణ లేదు. సుల్తాను ధైర్యశాలేగాని, యుద్ధనైపుణ్యం కలవాడు కాదు.



బాబరు సాహసవంతుడే గాక, జిత్తులమారి కూడా. అతడు తన ఫిరంగి గర్జనలతో, శత్రుసైనికులను హడలకొట్టాడు. సుల్తాను ఇబ్రహిం లోడీకి, అతడి సామంతు లెవరూ సాయం రాలేదు.



సుల్తాను తెగించి, యుద్ధరంగంలో వీరోచితంగా పోరాడుతూ మరణిం చాడు. అతడి దళాధిపతుల్లో ఒక రాజ పుత్ర యువకుడున్నాడు. అతడు తన ప్రభువైన ఇబ్రహిం మరణానికి ప్రతీ కారం చేసి తీరాలని దీక్షపూనాడు.



బాబరు ఢిల్లీ, ఆగ్రా నగరాలను ఆక్రమించుకున్నాడు. ఇప్పుడతడు లోడీ సుల్తానులు పాలించిన ప్రాంతం అంతటికీ, అధినేత. బాబరు తండ్రి తురుష్క జాతివాడైనా, తల్లి మాత్రం మంగోలు రాజవంశపు స్త్రీ. అందువల్ల బాబరు మొగల్‌గా పరిగణించబడ్డాడు. విజయం తరవాత బాబరు ఆగ్రానగ రాన్ని తన రాజధానిగా చేసుకున్నాడు.

రాజపుత్ర యువకుడు పగ తీర్చు కునేందుకు మార్గాలు వెతకసాగాడు. బాబరు వెంట ఎప్పుడూ అతడి అంగ రక్షకులుండేవారు. రాజపుత్ర యువ కుడు కొంతకాలానికి బాబరు గురించిన రహస్యం ఒకటి తెలుసుకున్నాడు. బాబరు వారానికొకసారి మారువేషంలో బయలుదేరి, నగరంలోని అన్ని ప్రాంతాలూ తిరిగేవాడు.





ఒకరోజున రాజపుత్ర యువకుడు, మారువేషంలో వున్న బాబరును సమీపించి, "అయ్యా, యీ వీధి వెనక వున్న కాలిబాట పక్కన, నా గోతం మూట వున్నది. దాన్ని నా తలమీదికి ఎత్తుకునేందుకు, కాస్త సాయపడ గలరా?" అని అడిగాడు. గోతాం ఎత్తే సమయంలో బాబరును కత్తితో పొడిచి చంపాలని యువకుని ఎత్తుగడ.

బాబరు సరేనని రాజపుత్ర యువకుడి వెంట పొదల దగ్గిరకు నడిచాడు. యువకుడు అతణ్ణి పొడిచేందుకు బొడ్లో నుంచి కత్తి లాగబోయే సమయంలో, వీధి వైపు నుంచి ఏనుగు ఘీంకారాలూ, జనం చేసే హాహాకారాలూ వినిపించినై.





బాబరు మెరుపు వేగంతో జనం మధ్యకు పరిగెత్తి, ఒక బాలుణ్ణి మదించిన ఏనుగు తొక్కబోతూండగా, అతణ్ణి చప్పున ఎత్తుకుని, దూరంగా పోయి నిలబడ్డాడు.

బాలుడి తలిదండ్రులూ, మరికొందరూ బాబరు చుట్టూ మూగి, అతణ్ణి ఎన్నో విధాల ప్రశంసించారు. బాబరు బాలుణ్ణి అతడి తలిదండ్రులకు ఒప్పచెప్పి, రాజపుత్ర యువకుడికి సాయం చేసేందుకు పాదల దగ్గిరకు వెళ్ళాడు.





యువకుడు బాబరుతో, "మీరెవరో నాకు తెలుసు. నా ప్రభువైన సుల్తాన్ మరణానికి, పగతీర్చుకోదలిచాను. కాని, ఒక బాలుణ్ణి రక్షించే ప్రయత్నంలో, మీరు ఆత్మార్పణకూడా సిద్ధపడ్డారు. మీరు ఉన్నతులు!" అన్నాడు.

బాబరు నవ్వి, "నువ్వు, నా కన్ను ఉన్న తుడివి కనకనే, నీ తప్పిదాన్ని ధైర్యంగా బయటపెట్టగలిగావు. ఈ నాటి నుంచీ మనం మిత్రులం!" అన్నాడు.

# కథా శీర్షిక పోటీ

## ఈ కథకు మంచి పేరు పెట్టి రు 25 లు గెలవండి!

?

తమ ఎండిపోయిన ఆవును సంతలో అమ్ముకు రమ్మని అవంతిని అతని భార్య తొందర చేసింది. అవంతి ఆవును సంతకు తీసుకుపోయి, ఒకచోట కూర్చుని, "ఈ ఆవు పాలియ్యదు! పొట్లది! ఎవరన్నా కొనండి!" అని అరవసాగాడు.

సహజంగా ఎవరూ ఆవును కొంటామని రాలేదు.

ఇదంతా చూస్తున్న ఒక తెలివిగలవాడు అవంతి అమాయకత్వం కనిపెట్టి, "నీ ఆవును నేను అమ్మి పెడతాను చూడు," అన్నాడు.

"ఈ ఆవు సాధువు! పదిశేర్ల పాలిస్తుంది! చౌక బేరం! మించిపోతే దొరకదు!" అని అతను అరవసాగాడు.

అది విని అవంతి, "నా ఆవు సాధువై, రోజూ పదిశేర్ల పాలిచ్చే మాటుంటే, నే నెందుకు అమ్ముతాను? నా ఆవును నా కిచ్చెయ్యి," అన్నాడు.

★ ★ ★

పై కథకు మంచి పేరు ఆలోచించి ఒక కార్డు మీద మాత్రమే, మీ చిరునామాతోపాటు రాసి, "కథా శీర్షిక పోటీ", చందమామ, 2&3 ఆర్కాట్ రోడ్డు, వడపళని, మద్రాసు 600 026 అన్న చిరునామాకు పంపండి. కవర్లు వగైరా పరిశీలింపబడవు.

కార్డులు మాకు సెప్టెంబర్ 20 లోగా చేరాలి. అందులో ఫోటోవ్యాఖ్యలు చేర్చరాదు. ఫలితాలు, '77 నవంబర్ చందమామలో ప్రకటించబడతవి.

---

జూలై నెల పోటీ ఫలితం: చెలియ పోయే, కలిమి పోయే, చేతులే తెగిపోయే!

గెలుపొందిన వారి పేరు: అన్నె శివశంకరరావు, పెదవడ్లపూడి. (గుంటూరు జిల్లా).

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 25 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1977 నవంబర్ నెల సంచికలో ప్రకటింపబడును.







Anant Desai R. Jayapalan

★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగాని కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.)

★ సెప్టెంబర్ నెల 20-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంతమాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 25/—లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, (వ్యాఖ్యలకు సంబంధించని ఇతర విషయాలేవీ చేర్చరాదు.) ఈ అడ్రసుకు పంపాలి :—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—**26.**

---

## జూలై నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : వక్రతుండం

రెండవ ఫోటో : విక్రయానికి

పంపినవారు : వి. తిరుమలరెడ్డి, రాచపల్లి. (కడప జిల్లా).

బహుమతి మొత్తం రు. 25/—ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

69




# అమృతాంజన్ లిమిటెడ్‌వారి విశిష్టమైన

# ఆముదము

శుద్ధిచేసినది.
వాసనలేనిది.




మూడు
సైజులలో
లభిస్తూంది:
50 మిలి
100 మిలి
200 మిలి

అమృతాంజన్ ఆముదము

OBM 327073 TG(R)

# చిల్లర పైసలే మీ జీవితంలో పెద్ద మార్పు తేగలవు







మీరు
రూపాయల
విషయంలో
శ్రద్ధ వహిస్తుంటే
సమయంలో చిల్లర
పైసలు తెలియ కుండానే మాయమై
పోతుంటాయి. మీ గృహబడ్జెట్టులో
మిగిలే మిక్కిలి చిన్నవనుకొనే 5
10, 25 పైసల నాణెములే తగినంత పొదుపు
నిధిగా మారగలవన్న విషయం మీరెరుగరా ?
చిన్న చిన్న మొత్తాల పొదుపు క్రమేణా పెరిగి
పెద్ద మొత్తమవుతుంది---అదే బాల క్షేమ
డిపాజిట్ పథకం
పొదుపు విలువ గురించి మీ పిల్లలకు నేర్పండి
మేమిచ్చే ఆకర్షణీయమైన పొదుపు పెట్టెలో
చిల్లర పైసలు వేయడానికి మీ పిల్లలు ఎంతో
ఉత్సాహపడతారు. పొదుపు పెట్టె తాళంచెవి
తీసుకొని మా బాలక్షేమ ఏజెంటు ఇంటింటికి వస్తారు
మీ గుమ్మందగ్గరకే వచ్చి మీరుపొదుపు చేసిన
మొత్తానికి రసీదు ఇచ్చి స్వీకరిస్తారు
చిన్న చిన్న మొత్తాల పొదుపు క్రమేణా పెద్ద
మొత్తంగా పెరగడం మీకు ఆనందాని



# రామ్, శ్యామ్ ఫిల్మ్ షూటింగ్ దగ్గర

"చూసావా రామ్... ఆ గుంపును చూడు, ఆ హడావిడీ... ఆ హంగామా చూడు."

"ఆ... ఆ... వెంకట్, అతనే హీరో అవును, టక్కున దూరంనుంచైనా గుర్తు పడతానేను."

డైరక్టరు పడ్డాడనుకుంట చిక్కులో
పడ్డాడు మరింక యిక్కట్లలో!

"ఎంత సేపట్నుంచో తంటాలు పడుతున్నాం, అతడిని నవ్వించ లేక చస్తున్నాం!"

"ఇప్పటికి అయ్యాయి యిరవైనాలుగు 'టేక్'లు, బోలెడన్ని తియ్యాలింకా సీనులు."

అతన్ని మంచి మూడ్‌లో పెట్టడానికుంది
ఉపాయం. ఫ్రూటీ పాపిన్స్ తప్పిస్తాయి అపాయం."

ఇప్పుడు షూటింగ్ ఏకబిగిగా నడుస్తోంది, పాపిన్స్ మళ్ళా తమాషా చేసింది.